# అభిప్రాయవేదిక

" శ్రీవాణి " ఉత్తమ సాంస్కృతిక మాసపత్రికగా తీర్చిదిద్దటంలో మీరు తీసుకుంటున్న శ్రమ నాకు తెలుసు. పత్రిక చాలా బాగా వస్తోంది. మీ కృషి, దీక్షాదక్షతలు జగమెరిగినవి గదా ! "

—విహారి, కడప

"వ్యయప్రయాసలకోర్చి మీరు చక్కని మాసపత్రికను వెలువరిస్తున్నందుకు అభినందిస్తున్నాను.

—దాశరథి, హైద్రాబాద్

" తొలి రోజుల్లో కంటే మీ సంచిక ఈనాడు క్వాలిటీ దృష్ట్యా అభివృద్ధి చెందినదని నా అభిప్రాయం "

— శేషేంద్రశర్మ, హైద్రాబాద్

"శ్రీవాణి జన్మదినోత్సవ సంచిక కూడా అందుకొని అందలి అమూల్యమైన సారస్వతాన్ని చదివి ఎంతో ఆనందించాను. నేనే కాదు-మిగతా మా మిత్రులం కూడ ఈ సంతోషంలో పాలుపంచుకున్నాం "

—కొర్రి మల్లిఖార్జునశర్మ, విశాఖపట్నం

" పత్రిక చాలా ఉన్నత విలువలతో, ఉత్తమ స్థాయిలో ప్రచురిస్తున్నందుకు సంతోషించుచున్నాను. "

—కప్పగంతుల మల్లిఖార్జునరావు, రాజమండ్రి

" శ్రీవాణిలోని సాహిత్య వ్యాసాలు మమ్ముల్ని ఎంతగానో అలరిస్తున్నాయి. "

—కొండముది రుక్మిణీదేవి, ఏలూరు

" శ్రీవాణి అందుకొని ఆనందిస్తున్నాను. పత్రికా నిర్వహణం ఎంత వ్యయప్రయాసలతో కూడినదో నాకు తెలుసును. మీరు ఇటీవల బాబావారిని దర్శించినట్లు మీ పత్రికవల్ల తెలుసుకొనినాను. మీ ప్రయత్నంలో బాబా సహాయం చేయగలరు. "

—సామవేదం జానకిరామశర్మ, వసంతవాడ

మార్చి - 1986
సంపుటి : 2
సంచిక : 3

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక
సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-51 రామానాయుడుపేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818

చందా వివరాలు
విడిప్రతి : రు. 3-00
సంవత్సర చందా : రు. 33-00
జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY
**Komaragiri Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM

## విషయ సూచిక

# జ్యోతిషవాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న, వాస్తుజ్యోతిష విద్వాన్
**కవితా కామేశ్వరశర్మ**
**అవనిగడ్డ - 521 121**

వి. యస్. నారాయణప్రసాద్ మద్రాసు

ప్రశ్న : జాతకం పంపుచున్నాను. చంద్రదశ యోగించునా ? ఫలాలు ఏలా వుంటవి.

సమా : మీది మేషలగ్నము. లగ్నచంద్రుడు. లగ్న చంద్రుడు—లగ్నాధిపతి 9 లో గాని 10 లో గాని వుంటే యోగిస్తాడని జాతక పారిజాత వచనము. మరియు అశ్వినీ నక్షత్ర వర్గోత్తమ చంద్రుడు యోగిస్తాడని కూడా శాస్త్రం కలదు. యీ చంద్రునిలో ( స్వభుక్తి కొంచెం చీకాకుగా వుంటుంది.) సంతాన సూచన. ఉద్యోగాభివృద్ధి. మాతాపితృలకు దూరంగా వుండుట. మధ్య మధ్య అశాంతి కలుగును. ఆర్థికంగా బాగుండును. యీ చంద్రదశ పితృభావంకి మంచిది కాదు. చతుర్ధ స్థానం కూడా పితృ స్థానంగా గర్గాది మునులు చెప్పినారు. ' జనకాది చింతనం తుర్యభే గర్గాదిమున యోభిభాషిరే '—అని శాస్త్రం. అంతేకాదు. చతుర్థంతోపాటు దశమం కూడా పితృ స్థానమన్నారు. 'చతుర్థే దశమే పితుః' అంతేకాదు. తాచకమతంలో 'లగ్నాచ్చతుర్థం పిత్రాఖ్యం, చంద్రాన్మాత్రా చ ఉచ్యతే ' అని లగ్నాత్ 4 వ స్థానమును పితృస్థానమని సంద్రాత్ 4 వ స్థానమును మాతృస్థానమని విడగొట్టి చెప్పినారు. మాతృ పితృ స్థానములకు ఏక రాశి చెప్పినా తప్పులేదు. ఆంగ్లంలో Parents అన్నట్లు సంస్కృతంలో పిత్రోః అని మాతాపితరుల గురించి వాడిన సందర్భం లేకపోలేదు. వారి జంట విడదీయరానిది. ' జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ ' సాధారణంగా 4 మాతృస్థానము 9 పితృస్థానము అని వాడుక.

గనుక మీ చంద్రుడు 4 పతి అయి 10 పతి దృష్టి కలిగి వుండుటను, చంద్రదశలో కర్మచేసే యోగము సూచితము. మనః కారకుడై వుండుటను యీ చంద్ర దశలో మానసికాందోళన తరచు కలుగుచుండును.

ప్రశ్న : స్థాన చలన ముండునా ? ఏ దిశకు ?

సమా : తప్పక వుంటుందని తోచును. దిశ విషయమా, తూర్పు లేక పశ్చిమ దిశలు కావచ్చును. మేష రాశి తూర్పును సూచించును. చంద్రుడు ఆగ్నేయ దిశను సూచించును. శని పశ్చిమమును సూచించును. శని దృష్టి బలీయము గనుక పడమర అయినా కావచ్చును. జల ప్రాంతం Watery Place కాకపోవచ్చు. మేష రాశి పాదజల రాశి.

కె. కరుణామయి

ప్రశ్న : మొదటి కాన్పుకు శస్త్ర చికిత్స జరిగింది. యీసారి మరల జరుగునా భయంగా వుంది.

సమా : భయంలేదు. ఒకసారి శస్త్ర చికిత్స జరిగినంత మాత్రాన మరల అవసరమను సిద్ధాంతమేముంది ? సుఖ ప్రసూతి అనియే నా తలంపు.

పి. సుబ్రహ్మణ్యస్వామి నెల్లూరు

ప్రశ్న : జాతకం పంపుచున్నాను. పుత్ర భావం ఏలా వుందో తెలియజేస్తారా స్వామీ.

సమా : పుత్ర భావము దోష భూయిష్టము, శాస్త్రం యీ విధంగా వుంది.

శ్లో॥ నందనేచ యదారాహు । ర్నందనేచ
యదా శనిః । నందనేచ యదా భౌ
మో నందనా గమనం నహి.

దీని భావమేమన లగ్నాత్ పంచమంలో శని రాహు కుజులున్న సంతాన శూన్యమనుట. అయితే రాహువును

పుత్ర సంతాన మిచ్చు గ్రహంగా జైమిని మహర్షి చెప్పినాడు. "పుత్రేషు రవి రాహు గురుభిర్బహు పుత్రః" గనుక రాహువు పై శ్లోకంలో చెప్పబడినా మినహాయింపు. పోతే-శని కుజులు (శని-భౌములు) దోషమే "శని కుజాభ్యాం దత్త పుత్రః" అన్నారు జైమిని మహర్షి.

కె. ప్రసన్నకుమార్ వరంగల్

ప్రశ్న : నాకు వివాహం ఎప్పుడు జరుగును.

సమా : యీ 1986 అనుకూలతగా కనిపించుచున్నది. గోచారరీత్యా కూడా గురుడు కుంభరాశిలోని సంచారము కూడా మంచిదే వివాహమునకు

"సితా త్త్రికోణ రాశిగే గురుర్బ
వేది గోచారే కరగ్రహ సథా
భవేద్వివాహ్య బుద్ధిమాన్ వదేత్"

దీని భావమేమన .. జాతకంలోని శుక్ర రాశికి త్రికోణ (5-9) రాసులలో గురువు సంచరించు (గోచార) కాలమున వివాహమగుననుట. అయితే ఇది పరమ ప్రమాణ (Standard) వచనము కాదనుకోండి.

ప్రశ్న : సప్తమ స్థానంలో శని వున్నాడు గదా! భార్య నల్లగా వుంటుందా?

సమా : సప్తమంలో శని వున్నంత మాత్రాన భార్య నల్లగా వుంటుందని గ్యారంటీ లేదు. ఇతర గ్రహాల చూపులు వగైరాలు కూడా చూడాలి. భావ చక్రం వేసుకుంటే శని సప్తమ భావంలో లేకపోవచ్చు ఒకప్పుడు. భావములకు భావ చక్రమే ప్రధానం వస్తుతః శని నల్లని రంగువాడే అనుకోండి - మీరు కొంచెం నలుపుగా వుండ వచ్చు లగ్నంకి శని దృష్టివల్ల.

యస్. రామచంద్రరావు అమలాపురం

ప్రశ్న : జాతకం పంపుతున్నాను. గురుదృష్టి మంచిదా? కాదా? గురువు శుభుడు గదా! కోణాధిపతి కూడా :

సమా : గురువు పూర్ణ శుభుడనుట నిజం "గురుః పూర్ణ శుభః" పంచమ కోణాధిపతి మాట కూడా నిజం.

జ్యోతిష వాణి

పేరు ......................................................

పూర్తి చిరునామా..........................................

......................................................

......................................................

లేఖ వ్రాయు తేది..........................

టైము పగలు/రాత్రి..........................

జనన తేది............(తేదిలేనిచో సుమారు వయస్సు)

గురుదృష్టి వలన మీకు ప్రజ్ఞ కలుగును. మంచివారను పేరు వచ్చును. సత్వ్వభావము కల్గును. పాపభీతి వుండును. కాని దృష్టి దారిద్ర్య లక్షణమన్నారు శాస్త్ర కారులు. సూ॥ రోగేశ దృష్ట్యా ద్దరిద్రాః-జైమిని. అనగా అష్టమాధిప దృష్టి దారిద్ర్య లక్షణం. జైమినీయంలో రోగ అంటే 8 సంఖ్య. పరాశరీయంలో 6 సంఖ్య. జైమినిలో అక్షర సాంకేతికం. గురువుకు పంచమ కోణాధిపత్యం వున్నా సింహలగ్నంకి శుభుడు కాడు. యీ దారిద్ర్య దోషం (లక్షణం) జాతక పీఠికపైన చెప్పాలి. ఆ దశకే కాదు. అనగా జనరల్ Strength లో యోగం తగ్గిపోతుంది. రెండవ అధిపత్యం ఏదైనా అష్టమాధిపత్యం వున్న గ్రహం శుభుడు కాడు. ఉదా : మిధునలగ్నంకి శని. కుంభలగ్నంకి బుధుడు. ఈ దారిద్ర్య లక్షణం జీవితంలో ఏదో విధంగా ఎప్పుడూ కనిపిస్తూనే వుంటుంది. అంతమాత్రాన యోగం వుండదని కాదు. ఇతర గ్రహాలవల్ల యోగం వుండవచ్చును. ★

# సంపాదకీయం

## ఇది శ్రీరాముని జన్మభూమి

" జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి "

అన్నారు ఏనాడో శ్రీరామచంద్ర ప్రభువు. ఆయనకే జన్మభూమిలో స్థానం లేకుండా పోయింది. ఇది మిక్కిలి దురదృష్టకరం. అయోధ్య శ్రీరామ జన్మస్థలం. ఎన్నో వేల సంవత్సరాల క్రిందట అక్కడ రామాలయం నిర్మించబడింది. రెండు వేల సంవత్సరాల క్రిందట విక్రమాదిత్యుడు ఆ ఆలయాన్ని పునరుద్ధరించాడు. ఆ దేవాలయంలో తొమ్మిది అంతస్థులు, ఏడు గోపురాలు వుండేవిట. ఆ ఆలయాన్ని కూలదోసి ఫకీర్ ఫజల్అబ్బాస్ఖిలందర్ కోరిక మీద బాబర్ 'బాబ్రా మసీదు' ను నిర్మించాడు. అబ్బాస్ ఆదేశానుసారము రామ జన్మభూమి దేవాలయాన్ని కూలగొట్టి ఆ సామాగ్రితో అదే స్థలంలో మసీదును నిర్మించినట్లుగా బాబర్ తన ఆత్మకథ 'బాబర్‌నామా' లో వ్రాసుకున్నాడు. మసీదు నిర్మాణం ప్రయత్నాన్ని ప్రతిఘటిస్తూ ఒక లక్ష ఎనభై రెండు వేలమంది హిందువులు ప్రాణత్యాగం చేశారని ప్రముఖ బ్రిటీష్ చరిత్రకారుడు కన్నింగ్‌హోం లక్నో గెజిటీర్ 36 వ సంపుటంలో వ్రాశాడు. హుమయూన్ కాలంలో మరియు అక్బర్ కాలంలో అనేక పర్యాయములు హిందువులు ఆ మసీదు మీద దాడులు సల్పారు. అక్బర్ మాత్రం ఆ మసీదు ముందు శ్రీరాముడి విగ్రహం పెట్టడానికి అంగీకరించాడు. 'సీతపాల్‌స్థాన్' అని పేరు మసీదు మీద వ్రాయించాడు. ఆ పేరు యిప్పటికీ అరబ్బీ భాషలో అక్కడ కనిపిస్తుంది. ఔరంగజేబు వచ్చి శ్రీరాముడి విగ్రహాన్ని మరల తీసివేశాడు. మొగలాయి రాజ్య పతనం తరువాత హిందువులు మరల అక్కడ శ్రీరాముని విగ్రహమును ప్రతిష్ఠించారు. 1885 లో తిరిగి హిందువులకు, మహమ్మదీయులకు ఘర్షణలు జరిగాయి. స్వాతంత్ర్యానంతరం 1949 ఫిబ్రవరి 22 న మహంత్ అభయ రామదాస్ అక్కడ రాముడి విగ్రహాన్ని పునః ప్రతిష్ఠించాడు. తిరిగి అల్లర్లు జరిగాయి. కోర్టు రిసీవర్‌ను నియమించింది. దేవాలయానికి రెండు వందల మీటర్ల దూరంలో ముస్లిములు వుండాలని ఆదేశిస్తూ రాముడి విగ్రహం చుట్టూ ఇనుప కంచెను వేయించి తాళం వేయించారు. కంచె బయట నుండి పూజలు చేసుకోమన్నారు హిందువులను. ఇరుపక్షాలు కోర్టుకెక్కారు. ఫైజాబాద్ జిల్లా సెషన్స్ జడ్జి 1986 ఫిబ్రవరి 1 న శ్రీరాముని సంకెళ్ళను తీయమని ఆదేశించారు. తాళంచెవి దొరకలేదు. జిల్లా కలెక్టర్, జిల్లా పోలీస్ సూపరింటెండెంట్ సమక్షంలో 1986 ఫిబ్రవరి 4 వ తేదీన తాళం పగుల గొట్టడం జరిగింది. హిందువులకు సంతోషం, ముస్లిములకు ఆగ్రహం కలిగింది. ఉత్తరదేశంలో మారణ హోమం చెలరేగింది. అనేకమంది బలైనారు. అనేక హిందూ దేవాలయాలు సర్వనాశనమైనాయి. ఇది ఈనాటి దుస్థితి.

హిందువులకు ఆరాధ్య దైవమైన శ్రీరాముని విగ్రహం శ్రీరాముని జన్మస్థలంలో ప్రతిష్ఠించుకొనే హక్కు లేకపోవడం శోచనీయం. దీనికింత వివాదం చెలరేగడం దురదృష్టకరం. భారతదేశంలో మొగలాయి దురాక్రమణకు పవిత్ర దేవాలయాలెన్నో నేలమట్టమయినాయి. బ్రిటీష్‌వారు వందలాది సంవత్సరాలు పాలించినప్పటికీ హిందూ దేవాలయాల జోలికి పోలేదు. క్రిష్టియన్ మత ప్రచారంకోసం ఎన్నో చర్చీలను నిర్మించుకున్నారు. మహమ్మదీయులు వారి ప్రచారంకోసం మసీదులు నిర్మించుకుంటే ఎవరికీ అభ్యంతరం లేదు. ఆ సహనం హిందువులకు ఆదినుండి వున్నది కాబట్టే అనేక మతాలు హిందూదేశానికి రాగాలిగాయి. హిందువుల సహనాన్ని, సర్వమత సమాన దృష్టిని బలహీనతగా తీసుకొని హిందువుల పవిత్ర స్థలాలమీద దాడి సల్పడానికి ప్రయత్నించడం ఏమాత్రం న్యాయం కాదు. పిల్లిని కూడా నాలుగు గోడల మధ్య బంధించి దండించడానికి ప్రయత్నిస్తే పులిగా మారుతుందనే నగ్న సత్యాన్ని విస్మరించరాదు. ప్రభుత్వం, వివిధ మతాధిపతులను సమావేశపరచి న్యాయసమ్మతంగా ఈ వివాదాన్ని పరిష్కరించి శ్రీరాముని జన్మస్థలంలో ఆలయాన్ని నిర్మించుకోడానికి ఎట్టి అడ్డంకులు లేకుండా చేసి మత సామరస్యాన్ని నెలకొల్పడం సముచితం, అత్యవసరం ——

ఇది శ్రీరాముని జన్మభూమి-హిందువులకు అత్యంత పవిత్రభూమి.

కొమరగిరి కృష్ణమోహనరావు

# చేమకూరవాని ఉలాచి

చేమకూర వెంకటకవి విజయవిలాస కావ్యరచన అద్భుత రీతివైభవంతో హాయిగా సాగి ఆంధ్ర సాహిత్య చరిత్రలో మణి మకుటంగా భాసిస్తున్నది. దక్షిణాంధ్ర వాఙ్మయ జలధి మథనంలో ఈ సుకృతి సుధాకలశంగా అవతరించింది. ఈ యుగంలో అనేక కావ్య మధుకోశాలావిర్భవించటం తెలుగువారి అదృష్టం. ఆ శతపత్రాలన్నీ ఆంధ్ర సరస్వతీ పదార్చనా కుసుమాలయినవి. అయితే కొన్ని వర్ణప్రకర్షమాత్రం కలిగి సహృదయుల మనస్సును చివుక్కుమనిపించినవి లేవని అనలేము. ఆ విషయ మటుంచుదాం.

విజయనగర సామ్రాజ్య పతనానంతరం అంత పేరు ప్రతిష్ఠల నందుకొన్నది నాయకరాజుల యుగం. అలాగే శ్రీ కృష్ణరాయలకు అన్ని విధాల సాటి అనిపించుకొన్న మేటి రాజచంద్రుడు రఘునాథరాయలు. అసమాన పరాక్రమ ధురంధరుడు. అనుపమ సాహితీ ప్రాభవ సంశోభితుడు. తాను కవి రాజయి కమనీయ కవితాలంకారాలతో తెలుగు శారదను ముస్తాబుచేసిన ఆలంకారికుడు. సంస్కృతాంధ్ర కవులను సమాదరించి సాహిత్య పుష్టిని సంపాదించిన సహృదయ శేఖరుడు.

తంజాపురాన్ని అతిసమర్థంగా ఏలుతున్న రఘునాథ రాయల ఆస్థానం సుకవికుల నిలయం. అందులో అతనికి పరమాప్తుడు మన చేమకూర వెంకటకవి. ఈ కవి తల్లజుడు రాజు చేతిమీదుగా అనేక సత్కారాలందుకొన్నాడు.

ఈ కవి కృతులు రెండే రెండుగా వెలువడినట్లు కనబడుతున్నది. వాటిల్లో సారంగధర చరిత్రకంటె విజయ విలాసం పండితులనేగాక తదితర రసజ్ఞులను కూడా ఆకర్షిస్తుంది. రెండు కావ్యాలూ శృంగార రస కాసారాలు. అయినా విజయ విలాసంలో దక్షిణాంధ్ర వాఙ్మయానికి ప్రధాన లక్షణాలనదగిన జాతి వార్తా చమత్కారాల కలకూజితాలు పదేపదే వినబడతాయి.

చేమకూరికి పూర్వకవులు సంస్కృత వాఙ్మయంలో సొగసులన్నీ పుణికి పుచ్చుకొన్నవారే. ఇతని కటువంటి విశేషాలేమీ మిగలలేదు. కొత్తదనమేమీ లేనిదే కావ్యానికి గౌరవం లభించదనేది నిజం. చెప్పినదే చెప్పినా చెప్పినట్లు తెలియకుండా చమత్కారంగా వ్రాయటం ఒక గొప్ప ప్రతిభ. ఎవరేం వ్రాసినా విషయం అచుంబితం అని మాత్రం అనలేము. కాని కవి తన రచనాశిల్పంలో నైపుణ్యం చూపించి కొత్త కనుపరుస్తాడు. వెంకటకవి కూడా తెలుగునాట ప్రచురంగావున్న కవి సమయాదుల్నీ స్వీకరించినా తన సహజ ధోరణిలో వాటికి కొత్తజీవం పోసి చక్కగా సమన్వయించాడు. సకలకళా సౌందర్యం మూసకట్టి కావ్యసృష్టి చేశాడు.

## కూచిభట్ల చంద్రశేఖరశర్మ

అది పాండవులు ఇంద్రప్రస్థంలో ఉన్నకాలం. ధర్మరాజు పాలనలో సుఖ మెరిగినవాళ్ళు అప్పటి ప్రజలు. ఐదు అమరతరువుల్లాగాను హరి పంచాయుధాల్లాగాను ఈశ్వరుని పంచముఖాల వలెనూ ఒప్పుతూ పంచ పాండవులు ప్రజల మన్ననలందుకొంటున్నారు.

ఇలా వుండగా ఒకసారి శ్రీకృష్ణుడు పాండవుల యోగ క్షేమాలు తెలిసికొని రమ్మని గదుడనే వాణ్ణి ఇంద్రప్రస్థానికి పంపించాడు. గదుడు పాండవుల కుశలవార్త తెలిసికొన్న తర్వాత విజయుని ఒంటరిపాటున కలిసి రహస్యంగా మాట్లాడాడు. మరేంలేదు ; ద్వారకలో మెరపు తీగెల్లాంటి అందగత్తెల గురించి వర్ణిస్తూ అంతతో ఆగక ప్రత్యేకం ఎవరో చెప్పమన్నట్లు సుభద్ర అందచందాలను ఆమె ప్రత్యంగ సౌందర్యాన్ని ఎంతో వివరంగా కళ్ళకు కట్టినట్లు

వర్ణించి చెప్పాడు. సహజంగా సుభద్రంటే యిష్టపడే అర్జునుని మనస్సు ఈ వర్ణనతో పరవసించి ఆమెను చూడాలని ఉవ్విళ్ళూరింది.

తదనుకూలంగా ఒకనాడు బ్రాహ్మణ గోసంరక్షణ చేయవలసివచ్చి విజయుడు విల్లంబులు తెచ్చుకోటానికి ద్రౌపదీ భవనం ప్రవేశించాడు. అది పొరపాటున జరిగింది. ఆదోష పరిహారానికి భూప్రదక్షిణం చేసిరావటానికి బయలు దేరాడు. ఈ తీర్థయాత్రల నెపంతో ద్వారకకు వెళ్ళి సుభద్రను చూడాలనేది యిందులో పరమార్థం.

ఇది విజయవిలాస కావ్య కథాబంధంలో ప్రధానగ్రంధి. ఈ గ్రంథి ద్వితీయాశ్వాసంలో బిగవటం ప్రారంభించి తృతీయాశ్వాసంలో సుభద్రకు భద్రంగా వేసే మూడు ముళ్ళతోగాని గట్టిపడదు. సుభద్రార్జునుల కథ రెండవ ఆశ్వాసం సగంలో ప్రారంభమవుతుంది.

విజయవిలాసం ముచ్చటగా మూడే ఆశ్వాసాలుగల మధురకావ్యం. ఇందులో మొదటిసగంలో విజయునికి ఇద్దరు నాయికలతో పొందు కుదురుతుంది. మొదటిది నాగకన్య ఉలూచితోను రెండవది మలయధ్వజుని కుమార్తె చిత్రాంగదతోను. వీరిరువుర్ని వివాహం చేసుకొని విజయుడు ఇద్దరు కుమారులకు తండ్రి అవుతాడు. మూడవది సుభద్ర. వీళ్ళు ముగ్గురూ శృంగార నాయికలే.

ప్రస్తుతం ఉలూచి విజయుని పొందిన తీరు గమనిద్దాం. విజయుడు మహావీరుడు. సుందరమూర్తి. శృంగార వీరాలతో మూర్తీభవించినవాణ్ణి నాయకునిగా ఎన్నుకోవటం దక్షిణాంధ్ర వాఙ్మయంలో అరుదు. అటువంటివాని ఎన్నిక చేసిన గౌరవం మొదటగా వెంకటకవికే దక్కిందనాలి. అర్జునుడు ఒక సరికొత్త దక్షిణ శృంగార నాయకుడుగా కనబడతాడు. శృంగారకావ్యాలెన్నివున్నా విజయవిలాసంలోని శృంగారం వివిధ దశల్లో విశిష్టంగా గోచరిస్తుంది. విజయునికి ముగ్గురు నాయికలతో పొందుకల్గటం మూడు విధాల శృంగారానికి దారితీసింది.

విజయుడు తీర్థయాత్రలు చేస్తూ భాగీరథిని చేరాడు. ఆ గంగా కల్లోలినీ సముత్తుంగ తరంగమాలికలు చూచి బహుముఖంగా స్తోత్రం చేశాడు. అందులో శుచిస్నాతుడై తైర్థికభూసుర సంఘాలకెన్నో దానాలు చేశాడు. దృఢవ్రతుడై నిత్యం హరికథా శ్రవణంచేస్తూ గంగాతీరంలో కూర్చున్నాడు. అదే సమయంలో గాంగసైకతాల మీద క్రీడించటానికి వచ్చింది ఉలూచి నాగలోకం నుంచి. ఉలూచి, అతిలోకసౌందర్య మంజూష. అర్జునుని చూడకుండానే యిన్నాళ్ళు తనలో వలపు పెంచుకొన్న వగలాడి. ద్రౌపదీ స్వయంవరానికి వెళ్ళి విజయుని పరాక్రమాన్ని కళ్ళారాజూచి మనసారా మెచ్చుకొన్న నాగలోకవాసులు అతన్ని గురించి విశేషంగా పొగిడితే విని ఆమె మనసులో తమకం పెనగొన్నది. అతన్ని ప్రణయదేవతగా తన హృదయమందిరంలో కొల్చుకొన్నది. తన సర్వస్వాన్ని అతనికి మనసా సమర్పించింది. అతని విక్రమాది గుణ సముదాయాన్నిబట్టి రూపసౌందర్యాలను ఊహించి ఒక మనోహరమూర్తిని భావిస్తూ వచ్చింది.. అచ్చమైన ప్రేమలో కాలుష్యముండదు కదా! అందుచే ఆమె భావించిన మూర్తి మరోవిధముగా ఉంటటానికి వీలులేదు.

ఇప్పుడు సువ్రతుడై కూర్చున్న విజయుణ్ణి జూచి విస్తుపోయింది. తన అంతఃకరణంలో మెదిలే మూర్తికి ఇతనికి భేదమేమీ కనబడలేదు. అతడే యితడని తిన్నగానే గుర్తించింది. ప్రత్యక్షంగా చూస్తూన్న ఆమె అక్షియుగళం నిర్నిమేషమై అతని లావణ్యాన్ని తనివితీర తాగేస్తున్నది. ముద్దరాలయిన ఉలూచి స్థితిని వెంకటకవి మాటల్లో చూడండి.

ఉ॥ పైపయిఁ గౌతుకంబు దయివాఱ యిటుండఁగ నంత సజ్జనం
బైపువుఁ జప్పరమ్మున నొయారముగాఁ గయిసేసి, దాన లీ
లా పరతంత్రుఁడై కలకల న్నగుచుండెడి సవ్యసాచి నిం
ద్రోపలరోచిఁ జూచి తలయూఁచి యులూచి రసోచితంబుగన్

కలకల నవ్వుతున్న అతన్ని వలపుచూపుతో చూచిందన్నమాట. ఆమెకతను బాగా నచ్చాడు. అందుకనే తలపోచింది. అంటే సొగసంటే యిలావుండాలి అని అతని అందం మెచ్చుకొన్నది.

క॥ సిగ సంపెంగపూ, రొస పరి
వగ కస్తురినామ మొఱపు వలెవాటౌరా!
సొగ సిటులుండఁగ వలెనని
సొగసి, లతాతన్వి యతని సొగసు నుతించెన్

అర్జునుని షోకిల్లావేషం దక్షిణాంధ్ర యుగంలోని నాగరిక లక్షణం.

ఉలూచి తీర్చినట్లున్న అతని కనుబొమల్ని చూచింది. చెంపకు చేరెడేసి కళ్ళు అని మురిసిపోయింది. అతని చేతులబారు, ఊరువుల తీరు, వక్షఃస్థలలోని సొరు చూచి ఉక్కిరిబిక్కిరయింది. మగవాని అందాన్ని చూచి ఎలా మెచ్చుకోవాలో ఆమెకు బాగా తెలుసు. కనుకనే ఆపాద మస్తకం అతని సొగసు రెప్పపాటు లేకుండా తన విశాల నేత్రచషకంతో తృప్తిగా గ్రోలింది.

సామాన్యంగా స్త్రీ అందచందాలను జూచి అంగ ప్రత్యంగ వర్ణనలతో పురుషులు పొగడటం చూస్తాంగాని స్త్రీయే పురుష సౌందర్యాన్ని ఇంతగా వర్ణించటం తెలుగు కావ్యాలలో తరచుగా చూడం. ఇలా వర్ణించిన కొద్ది మందిలో వెంకటకవి మేటి. ముందుముందు సుభద్రచేత గూడ "ఎగుబుజంబులవాడు" అని అర్జునుని వర్ణింపజేస్తాడు.

ఉలూచి అలాగే నిలబడి విజయునికి కనుఘురుగ్గావుండి అతని త్రిజగన్మోహన సుందరాకృతిని గాఢంగా చూచిన మీదట ఏమైనాసరే "అమ్మకచెల్ల! నా హృదయ మమ్మక చెల్లదు వీనికియ్యెడవ్" అని గట్టిగా నిర్ణయించుకొన్నది. అతనితో సహజీవనం అతని పొందువచ్చే మధురానుభూతుల్ని బహువిధాలుగా ఊహ చేసింది. ఆమె మధురభావనలో అచ్చమైన ప్రేమ అమాయికత గోచరిస్తాయి. అట్లా అని ఆమెను సామాన్యగా భావింవరాదు. ఆమె ధీమాన్య. మంచి ఆలోచనా పటిమగల చాన.

కాని తన్ను ఇంత ప్రేమించినా అతడామెను ఎడుగడు. మునెన్నడూ చూడలేదు. అతని మదిలో ఒక సుభద్రే చోటుచేసుకొన్న దింతవరకు. అతని గొడవలో అతనున్నాడు. నిర్మల మనస్సుతో జాహ్నవీతటాన సంధ్యవార్చి జపతత్పరుడై వుండగా అతనిపై మచ్చుజల్లి మాయ చేసిందోయేమో ఉలూచి విజయుని ఉన్నపాళంగా తీసుకపోయి నాగలోకంలో నిజాంగణంలో నిలిపింది. పాపం అతనికేం తెలుసు ఈ రగడ. కన్నులు మూసినవాడు అలాగే వున్నాడు. కొంతసేపటికి మెల్లగా కళ్ళు తెరచి చూచాడు. ఏముంది? అంతా ఆశ్చర్యం. వాతావరణం మారింది. జరిగిన తతంగం ఏమీ బోధపడలేదు. ఇంతలోనే భుజంగ గజగామిని కన్నెదుట తళుక్కున మెరిసింది. పూర్వమెన్నడూ చూచినవాడు కాకపోవటంతో కాస్త కంగారుపడి ప్రవరుడు వరూధిని నడిగినట్లు "పద్మాక్షి! యెవ్వరి దానవీవు? పేరెయ్యది? నీకు నొంటి వసియింపగఁ గారణమేమి?" అని నిబ్బరంగానే అడిగాడు పరిస్థితి బాగా అర్థమయిందతనికి. అతని ప్రశ్నలకు ఆమె సమాధానం చూడండి – "ఓ మదవతీ నవ మన్మథ! ఈ జగంబు పాతాళము; నేనులూచి యన, భుజంగమరాజ కన్యకన్" అని సోగకన్నులతో చూస్తూ పయ్యెద సవరించుకొంటూ సమాధానం చెప్పింది. ఆమె సమాధానంలోవుండే తన అభిప్రాయానికి ఆమె ఒయ్యారపు కదలిక వ్యాఖ్యానమయింది. కాస్త ఆగి నీ విలాసం చూచి మోహించి యిక్కడికి తీసుకొని వచ్చానని బయటపడ్డది. ఇంకా కాస్త జాణతనం చూపించింది. మోహావేశంతో వచ్చిన ఆ జవ్వని గడుసు మాటలకు ఇంత దృఢవ్రతుని మనస్సూ చలించింది. సహజంగా నాగకన్య లందగత్తెలు. ఇప్పుడది ప్రత్యక్షంలో నిజమైంది. ఆమె రూప విభ్రమ రేఖలకు, సుధాప్రసన్నాలయిన వాక్కులకు మైమరచాడు విజయుడు. ఆమె సర్వాంగ సౌందర్యాన్ని కళ్ళతో ఆపోశనబట్టి

నువ్వు పువ్వు నవ్వు జవ్వని నాసిక
చివురు సవురు జవురు నువిదమోద
మబ్బు నుబ్బు గెబ్బు బిబ్బోక వతివేణి
మెఱపు నొఱపుఁ బఱపుఁ దెఱవమేను.

అని హృదయపూర్వకంగా అభినందించాడు. కాని అత నేమాత్రం ఆతురత వ్యక్తం చేయలేదు. వ్రత దీక్షలో నున్నవాణ్ణి ఇలా తీసుకుని రావటం భావ్యం కాదనీ ఇంత సాహసం ఇంతులకు తగదనీ పైకి బింకం చూపుతూ మందలించాడు.

ఆమె అంతమాత్రానికి హడలిపోలేదు. ఆ మాటల చాటునున్న మమతను పసిగట్టింది. చిరునవ్వు నవ్వింది. ఒయ్యారంగా, ఠీవిగా నడవటంలో అందం ఒలకబోసింది. మెల్లగా దగ్గరగా చేరి "ఓ రసిక శేఖర, ఓ జనరంజనైక లీలావహరూప, ఓ నుతగుణా ! తగునా ! ఇటులాన తీయగన్" అని మారు పలుకుతూ నీ అతులిత విలాస రేఖలతో త్రిభువన లీలావతుల నలయించటమేనా నీ వ్రతం ? అని సూటిగా అడిగింది.

ఎంతగానో నిన్ను గురించి విని ఇప్పుడు కని మోహ పడిన నన్ను మదనుడు నిలవనీయటంలేదు. అందుకని నీ మరుగు చేరాను. చేపట్టి రక్షించి పుణ్యం కట్టుకో అని ప్రాధేయపడి చివరికి "ప్రాణదానము కన్నను వ్రతము కలదె" అని కర్తవ్యం బోధించింది. అంటే తనను స్వీకరించకపోతే ప్రాణపరిత్యాగమే అని సూచించిందన్నమాట.

"పరసతి నెనయుట రాజులకు ధర్మమే" అని సంకోచించిన అతడు అనవలసి అంటున్నాడని గ్రహించింది.

ఉ॥ కన్నియ(గాని వేఱొకతెగాను మనోహరరూప; నీకు నే
జన్నియ పట్టియుంటి నెలజవ్వనమంతయు నేటిదాక; నా
కన్నుల యాన; నా వలపు( గస్తురి నామముతోడు;
నమ్ము; కా
దన్నను నీదుమోవి మధురామృతమానిట బాససేసెదన్"

అని తన ప్రేమ నిష్కల్మషమని తెలుపుతూ అతనికి నమ్మకం కలగటానికి పెద్ద ఒట్టు పెట్టుకొన్నది. ఈ ఒట్టులో ఒక చమత్కారమున్నది.

తాను వివాహం కాని కన్నెపిల్ల. తన యౌవన మంతా విజయుని కోసం నేటిదాకా ముడుపు కట్టిందట. నమ్మకమేమిటంటారా ? అతడెప్పుడు తటస్థపడతాడా అని యింత కాలం ఎదురుచూచింది. ప్రేమించి కలలు కంటూ ఊహల్లో జీవిస్తున్న కన్నెగాని వేరొకతె కాదు. లేకపోతే అంత అందగత్తెనెవరైనా ఎగరేసుకపోయేవారే. ఇంతగా అర్జునునికి తనపై విశ్వాసం కలగాలంటే పెద్ద ఒట్టు పెట్టుకోపోతే యెట్లా ? అందుకోసం ఆమె ఒట్టిడి కొన్నది.

లోకంలో సామాన్యంగా పిల్లలు గట్టి నమ్మకం కోసం ఒట్టు పెట్టుకొంటారే అట్లా చేసింది. అట్లా అనటంలో పాపం కన్నెప్రాయపు అమాయికత కనబడాలని కాబోలు ఆమె తపన. ఆమె ఏ మాత్రం అమాయిక కాదని ఆ రకం ఒట్టునుబట్టే తెలుస్తోంది. ఒట్టనేది తనకు ప్రియాతి ప్రియమైన దానిమీద పెడతారెవరైనా. అప్పుడుగాని ఎదుటివారు నమ్మరు. తనకు విజయునిమీద వల్లమాలిన ప్రేమవుందని తెల్పటానికి తన కిష్టమైన వలపు కస్తూరి బొట్టుమీద పెట్టింది. ఒట్టంటే మాటలా ? అది ఆడదానికి మంగళప్రదం. అప్పటికీ సందేహిస్తాడేమో అని వెంటనే ప్రమాణం చేస్తానన్నది. దేనికైనా సాక్ష్యం ఉండాలిగా ! ప్రకృతిలో పంచభూతాలు కర్మసాక్షులు. జలం పంచ భూతాల్లో ప్రధానమైంది. ఆ జలంతాకి ఏ ప్రమాణం చేసినా చెల్లుతుంది శాస్త్రరీత్యా. ఉలూచికి ఇప్పుడు ఆ జలం సాక్ష్యమైంది. జలమంటే రసద్రవ్యమేగా ! అది యింకా విశిష్టరసమైతే మరీ మంచిది. అందుచేత అతని మోవి మధురామృతమాని బాస చేస్తానంది పాపం.

ఈ చివరి మాటలోనే వుంది ఆ వగలాడి గడుసు తనమంతా. ఈ మాటల్లో సాహసం కూడా కనబడు తున్నది. అభిమానం గాఢమైనప్పుడు తెంపు కలగటాని కవకాశముంది. అను ఎంత కాలంనుంచో అతనిపై ఆమె మమత పెంచుకొన్నది. ప్రణయం పల్లవించి ననలెత్తి యిప్పుడు ఫలోన్ముఖ స్థితిలోకి వచ్చింది. ఇంతగా పరిణతి చెందిన ఆమె యెదలోని సొద యిదంతా. ద్రౌపదీ స్వయం వరం నాటినుండి విజయునిపై అనురాగం పెరిగి విరహ వ్యథతో కాలం గడుపుతూ అతన్ని ఊహలతో చిత్తరువులో

అందంగా చిత్రించి చూసుకొంటూ కలలుకంటూ వచ్చింది. ఇప్పటికి ఆ కల నిజమైందనే ఆనందం అతివేలమైంది. అతన్ని చూచింది మొదలు తమకం పట్టలేకపోయింది. ఉన్నపాళంగా అతన్ని బిగికౌగిట్లో చేర్చుకోవాలనుకుంది పాపం. ఈ విషయంలో అర్జునుడొప్పుకొనేదాకా ఆగలేనని ఆత్రపడింది.

కథ యింతదూరం యిన్ని మలుపులు తిరిగి వచ్చిన తర్వాత విజయునికి గొంతులో పచ్చివెలక్కాయ పడింది. తన సమాధానం ఆలస్యమైతే ఆమె తనూలత అతన్ని అల్లుకొనేలావుంది.

ఒక ఆలోచన మెరిసింది. ఆమె నాగజాతిది. తాను మనుష్య జాతివాడు. పొత్తెలా కుదురుతుంది? దీంతో ఆమె వెనక్కి తగ్గుతుందనుకున్నాడు.

దానికామె ఏమాత్రం తడువుకోకుండా

ఉ॥ ఏమనఁబోయెదం దగులమెంచక నీవిటులాడఁదొల్లి శ్రీ
రాము కుమారుఁడైన కుశరాజు వరింపడె మా
కుముద్వతిన్ ?
కోమల చారుమూర్తి పురుకుత్సుడు నర్మదఁ
బెండ్లియాడఁడే ?
నీ మనసొక్కటే కరఁగనేరదుగాని నృపాలకాగ్రణీ॥

అని సోదాహరణంగా జాతి భేదం పట్టింపు లేదని సమాధానం పలికింది. ఎంత జాణతనమో చూడండి. అమాయికంగా మొఖం పెట్టింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. కంఠం డగ్గుత్తిక పడింది. ఇవన్నీ చూస్తుంటే అనంగ దశల్లో చివరిదానికి చేరువవుతున్నదనిపించింది.

ఎదురుగ్గా అంత మదనాగ్ని ప్రజ్వలిస్తూంటే విజయుని వెన్నలాంటి మనసు కరిగిపోదంటారా? అతనేమీ స్త్రీ పరాఙ్ముఖుడు కాదుగా! అయితే సుభద్రకోసం బయల్దేరిన వాడు. దారిలో అనుకోకుండా ఈ ఉలూచి తటస్థపడింది. తానేమీ ఏకపత్నీవ్రతుడు కాదుగా! కానప్పుడు ఎంత మందినైనా ఇష్టపడితే చేసుకోవచ్చుగదా! అందులోనూ తనంటే యింతగా ప్రేమించి వచ్చిన సుందరాంగిని కాదంటే అతను సరసుడెట్లా అవుతాడు. ఒకవేళ కాదంటే



ఆమె ప్రాణం కూడా పోయేలా వుంది. ఆ పాపం కూడా మూటకట్టుకున్నవాడవుతాడు. పుణ్యానికి పోతే పాపమెదురైనట్లవుతుంది.

విజయుని మనస్సులోకూడా ఆమెమీద వలపు క్రమంగా పెరిగింది. ఆమె చక్కదనం ఎప్పుడో అతన్ని ఆకర్షించింది. అయితే కాస్త నిదానించాడు. ఆమె వలపు గుర్తించాడు. అంతే.

" చక్కెర బొమ్మ ! నా వ్రతము చందముఁ దెల్పితి:
అంతెకాక నీ
చక్కదనంబుఁగన్న నిముసంబయిన న్నిలుపోవ
శక్యమే అక్కునఁజేర్పక "

అని అతను సాదరంగా అన్నాడో లేదో అమాంతం ఆమెకు సిగ్గుదొంతర్లు దూసుకొని వచ్చిపడ్డాయి. ఏమైనా చివరికి ఉలూచి ప్రణయం ఫలించింది.

నాగరిక ముద్రగల మంచి బాగరియఁట !
నాగవాసములో వింత నటనలదఁట !
కులుకు గుబ్బల ప్రాయంపుఁ గోమలియఁట !
వలచి వలపింపదే యెంతవారినైన ?



# వేదరక్షణ మానవ ఉత్కృష్ట ధర్మం

**- శ్రీ భారతీ తీర్థస్వామి**

## గురుశిష్యులు

బృందావనపుర కళ్యాణ మండిరంలో ప్రసంగిస్తూ గురుశిష్య సంబంధం పరంపరగా వస్తుందని, ఆదిశంకరులు

> యదా యదాహి ధర్మస్య
> గ్లానిర్భవతి భారత !
> అభ్యుత్థాన మధర్మస్య
> తదాత్మానం సృజామ్యహమ్ ॥

శ్రీకృష్ణ పరమాత్మ పార్థునకు బోధించినట్లు దేశంలో అధర్మం ప్రబలంగా వున్నప్పుడు లోకోద్ధరణ కొరకు సాక్షాత్ పరమశివుడు, శ్రీ శంకరాచార్యునిగా కేరళలోని కాలడి గ్రామంలో అవతరించి, అద్వైత మతమును పునరుద్ధరింపజేసి, ధర్మ రక్షణకు, ధర్మ పరిపాలనకుగాను చతురామ్నాయ సంజ్ఞికములుగా, చతుర్వేద సంకేతములుగా శ్రీ శృంగేరి, ద్వారక, బదరి, పూరి అను 4 క్షేత్రములందు పీఠములు స్థాపించి అందు ప్రధాన పీఠమగు శ్రీ శృంగేరి శారదా పీఠమందు తమ ప్రియ శిష్యులు శ్రీ సురేశ్వరాచార్యులవారిని నియమించిరి. శ్రీ శంకర భగవత్పాదులవారి నుండి నేటి వరకు పరంపరగా ఆచార్య పీఠాన్ని అలంకరిస్తూ వస్తున్న వారిలో శ్రీ అభినవ విద్యాతీర్థ మహాస్వామివారు 35వ వారు కాగా వారి ముఖ్య శిష్యులు శ్రీ భారతీ తీర్థస్వామివారు 36వ వారు. వీరు భక్తి ప్రపత్తులకు ఆలవాలమైన బందరు పురానికి విచ్చేసిన సందర్భములో వారు యిచ్చిన సందేశముల సారాంశం యిస్తున్నాము.

ఆస్తిక జనులందరిని తీర్చిదిద్దే కృషి సలిపి సఫలీకృతులైనారని తెలిపారు. వారితో విద్యారణ్యులవారు కాలు చేయి కలిపి కదిలి ఆ కార్యక్రమం కొనసాగించారన్నారు. ఆంధ్రదేశంలోని విద్వత్ జనులు భగవత్పాదులవారికి ఎప్పుడూ ప్రతిపక్షులుగా లేరని. వారు శంకరులకు భక్తితో నమస్కరించి శిష్యరికం స్వీకరించినవారని అన్నారు. శంకరులు ఆంధ్రదేశంలో పర్యటించే ముందు తిరుపతిలో వెంకటేశ్వరుని దర్శించినారని విద్యారణ్యులవారి కథనం. ఇంకొక విషయం. ఇక్కడ ఆదరం, భక్తి భక్తులలో శంకరులపట్ల సదా వెల్లివిరిసిందని అది అన్ని పీఠాల విషయంలో సమంగా వున్నదని కూడా విద్యారణ్యులవారి మాట అక్షరసత్యమని శ్రీచరణులు తెలిపారు. ధర్మ రక్షణకు శృంగేరీ పీఠాధిపతులు అందరూ అనేకసార్లు ధర్మ యాత్రలు దేశమంతటా విస్తారంగా చేశారని కూడా చెప్పారు.

## ధర్మం

బందరు పురమందిరంలో జరిగిన మహాసభలో శ్రీచరణులు " ధర్మం, దాని అర్థం " అనే విషయం మీద సుస్వరంలో భవ్యమైన భాషణం చేశారు. ప్రాచీనుల మాట : "ధారణా ధర్మ హిత్యాహం" అనగా దేనివలన జగత్తు యొక్క ధారణం, నిలుకడ కలుగుతున్నదో, అదే ధర్మం అని చెప్పారు. ఇది ఎలా తెలుసని ఎవరైనా అడిగితే భారతీయులైనవారికి ప్రమాణం వేదమని, ధర్మ ప్రతిష్ట వేదం ద్వారా విదితమని స్పష్టం చేశారు. జగత్తు సరైన మార్గంలో ఏ విధమైన ఒడిదుడుకులు లేకుండా నడవాలంటే మానవ ప్రయత్నం మాత్రమే చాలదని దానికి అతీతమైన దైవ యత్నం కూడా కావాలన్నారు.

ఒక దేశంలో సకాలంలో వర్షాలు లేకపోతే ఆ దేశ పరిస్థితి ఎలా వుంటుందో ఊహించవచ్చు. విజ్ఞానశాస్త్రం ఆ పరిస్థితిలో కృత్రిమ వర్షం సృష్టించవచ్చు కాని అది సహజసిద్ధంగాదు. సమ స్థితి భగవంతుని ద్వారానే కల్గుతుంది. అది అవశ్యం. ఒకొక్కక్క ఋతువునకు ఒకొక్కక్క ధర్మం కలదు. జగత్తు వ్యవస్థ ఋతు ధర్మంపై ఆధారపడింది. వేసవి కాలంలో వానలు, హేమంత ఋతువులో చలి వస్తే క్షోభం మిగులుతుంది. ఋతుధర్మ వర్తన మానవ ప్రయత్నంపై ఆధారపడి లేదు. జగత్తు మనుగడకు హేతు భూతమైన ధర్మం మానవులు ఆచరించినప్పుడే ఋతుధర్మం ధర్మ బద్ధంగా వుంటుంది.

భగవద్గీతలో భగవానుడు చెప్పిన ప్రకారం సృష్టి ఆరంభంలోనే సృష్టికర్త ధర్మబోధచేసి, అది అనుష్టించ వలసిన విధానం, తద్వారా దేవతలు ఎలా తృప్తులౌతారో విశదపరచియున్నాడు. తృప్తి చెందిన దేవతలు సర్వ సంపత్తులు మానవులకిచ్చి వాటి బలిమితో తిరిగి ఆరాధించ మని మార్గాంతరము చూపుతున్నారు. ఇది ఉభయ సామరస్యం. ప్రకృతి వైపరీత్యాలు ధర్మ నిరతిలో సంభవించవు. అప్పుడే మనుగడ, నిలుకడ వుంటాయి. జగత్ ప్రతిష్టా సాధనం ధర్మం.

## ధర్మం - స్వరూపం

ధర్మం స్వరూపం ప్రతి ఒకరు వారి ఇష్టం వచ్చినట్లు నిర్ణయించబూనడం తప్పు. కొంతమంది పీఠాధిపతులను ధర్మశాస్త్రాన్ని మార్చమని సూచించారు.కాని ఏ పీఠాధిపతి అలా మార్చరాదు. ఎవరి ఇచ్ఛ వచ్చినట్లు వారు ధర్మం స్వరూప స్వభావాలను నిర్ణయిస్తే ఇక అక్కడ మిగిలేది గందరగోళ పరిస్థితే. శ్రీ శంకర భగవత్పాదులు బ్రహ్మసూత్ర భాష్యంలో ఈ విషయం ప్రస్తావించారు. కొంతమంది వేదాలను, ఉపనిషత్తులను ఆధారంగా చేసుకొని ధర్మం స్వరూపం తెలుసుకుంటుంటే మరి కొందరు తమ బుద్ధికి తోచినదే ధర్మం అని భావిస్తున్నారు. కాని ప్రతిదానికి ప్రమాణం కావాలి. అదే ధర్మం విషయంలో వేదమే ప్రమాణం. అత్యంత దుఃఖ భూయిష్టమైన ఈ సంసారంలో విముక్తిలేక పునః పునః చిక్కుకొని పీడింపబడే ప్రమాదం వుంది. కొందరు దీన్ని సంశయిస్తే అది వారి గ్రహచారం. ఇక ధర్మం ఆచరించే విషయంలో ఎవరు ఎంతవరకు చేయగలరో అంతవరకు ఆచరించాలి. మనుష్యులు ఎన్నో పనులు చేయగలిగి ధర్మం ఆచరించే విషయంలో అనాసక్తులు కాకూడదు. ఉదాహరణకు ఉపనయనం అయిన తరువాత అర్హులైన వారందరూ గాయత్రీ జపం 1000, లేక 300 లేక 108 లేక 32 కాక కనీసం 10 అయినా చేయడం ధర్మం.

ధర్మాన్ని దాని స్వరూపాన్ని తెలిపేవి శృతి, స్మృతులు : శృతిస్తు వేదో విజ్ఞేయః

ఇది తెలిసి తెలియనట్లు వుండటం అపచారం. ధర్మ శాస్త్రకారుడు మనువు ధర్మాన్ని శంకించగూడదని శాసిం చాడు. ఇక సులభమైన విధంగా చెప్తే, దేన్ని ఆచరిస్తే శ్రేయస్సు కలుగుతుందో అదే ధర్మం. అదే వేద ప్రమాణం కూడా తెలిపినది. ధర్మశాస్త్రం వేదం నుండి వచ్చినది.

## వేదరక్షణ

"వేదేన ప్రయోజన ముద్దిశ్య అర్థో ధర్మః"

మానవుడు సృష్ట్యాది వేదాన్ని పెట్టుకొని చరిస్తు న్నప్పుడు వేద దూషణ అపచారం. ప్రాచీనుల పరం పరాగతమైన విధులను ఆక్షేపించడం అపరాధం. వేద రక్షణ మానవ ఉత్కృష్ట ధర్మం. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం". శ్రద్ధ కలవారికే పై విషయాలు వర్తిస్తాయి. సమ్మకం వున్నవారికే పరిమితం అవుతాయి.

వేదం ఎందుకు చదవాలని అడిగితే సమాధానం, చదవటం విధి కనుక, అర్హత వున్నవారికి ఆ అర్హతను వినియోగించుకొనే అవకాశం వుంది కనుక అని చెప్పాలి.

అయినా ఇలాంటి ప్రశ్న ప్రాచీనులకు ఎప్పుడూ రాలేదు. అప్పట్లో పుస్తకాలూ లేవు, ముద్రణ యంత్రాలు లేవు. గురు ముఖత విద్యను శిష్యులు స్వీకరించేవారు.

నాడు ధర్మబద్ధమైన జీవన విధానం వేరు. నేడు పాశ్చాత్యులను అనుకరించడం, మన సంబంధీకులు, బంధువులు విదేశాలలో వున్నారన్నా, మనం విదేశాలకు వెళ్తున్నామని చెప్పుకున్నా మనకు గర్వకారణం. కాశీ, రామేశ్వరాలకు వెళ్ళిరావడం అప్పుడు పరమ పవిత్రం, ఇప్పుడు ఇంగ్లండు, అమెరికాలకు వెళ్ళిరావడం మహద్భాగ్యం. భారతదేశం కర్మభూమి, పవిత్ర నదులకు నిలయం, పుణ్యభూమి అని విదేశీయులు సహితం నమ్ముతున్న ఈ తరిలో మనకు సంస్కారం కారణంగా ఈ ఆలోచనా విధానం పెచ్చు పెరుగుతుంది.

## ధర్మాన్ని వదులుకోరాదు

ఉదర పోషణ నిమిత్తం బహు వేషాలు వేయాల్సి వచ్చినా ధర్మాన్ని వదులుకోరాదు. ఎవరికి వారు తమ జీవితం పశుతుల్యంగా వుందా మానవ ధర్మబద్ధంగా వుందా అని ఆలోచించుకోవాలి. ప్రతి నిత్యం తమ నడవడిని గూర్చి ప్రశ్నించుకొని సంచరించాలి. అధర్మ మార్గంలో చరించేవారు అభివృద్ధిలోకి వస్తున్నట్లు అగుపిస్తారు. కాని వారు సంతోషంగా అధర్మం ఆచరించి కష్టంగా ఫలితం అనుభవిస్తారు.

హసతా క్రియతే కర్మ
రుదతా కరి భుజ్యతే ॥

ధర్మాన్ని గూర్చి ఇంకా స్థూలంగా చెప్పాలంటే :

## ధర్మం - అధర్మం

" పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనం " అన్నట్లు ఇతరులకు ఉపకారం చేయడం ధర్మం. అపకారం చేయడం అధర్మం. ఆ ఇతరులు శత్రువులు కావచ్చు మిత్రులు కావచ్చు. ఉపకారం చేయలేనిచోట ఊరికే వుండటం ఉత్తమం. భారతదేశంలో పామరులు కూడా ఈ ధర్మం గూర్చి చెప్పగలరు కాని ఆచరణ లోపం చేస్తారు. ధర్మ బోధకుల సంఖ్య హెచ్చుగా వుంది కాని ధర్మం ఆచరించేవారి సంఖ్య నానాటికి తరిగిపోతోంది.

## విద్య

స్వామివారు జైహింద్ హైస్కూల్‌లో క్లుప్తంగా భాషిస్తూ : " విద్యా విహీనః పశుభిః సమానః " అనే మాట ప్రతివారు విన్నదేనని, ఏ ఒక్కరూ తాను జంతువు లాగా బ్రతకాలని తలపోయరని అన్నారు. జంతువులాగా కాకుండా మనిషిలాగా బ్రతకడానికి విద్య అవసరం. ఆ విద్య వివేకం, వినయం ఇచ్చినప్పుడు శోభిస్తుంది. డిగ్రీలు, రాంకులు రావడం మాత్రమే విద్యకాదు. పెద్దలను, గురువులను గౌరవించడం వినయానికి లక్షణం. విద్యార్థులు క్రమశిక్షణతో నిరంతర కృషితో ఇతర వ్యాసంగాలు లేకుండా విద్య అభ్యసించి విజ్ఞులై విజయాన్ని, వికాసాన్ని, ఆత్మసంతృప్తిని పొందాలన్నారు. ఎవరు ఈ రకంగా విద్య అభ్యసించరో వారు మరొకరికి బోధించలేరు. బోధించినా వారిమాట ఎవరూ వినరు. సమ్మెలు, అలజడులు విద్యార్థులకు అవరోధాలు. వారి ధ్యేయాలకు గొడ్డలిపెట్టు వంటివని ఆచార్యులవారు అభిభాషించారు.

## ఆస్తికం—నాస్తికం

చింతగుంటపాలెం లోని బాలాత్రిపురసుందరి నాగేశ్వర స్వామివారి దేవాలయంలో ప్రసంగిస్తూ శ్రీ చరణులు, ప్రతి మనిషి అంతఃకరణలో కదిలే భావనలు భగవత్ ప్రేరితాలని తెలుసుకోవాలని అవే మన జీవనానికి సోపానాలని అలా కాదనేవాడే నాస్తికుడని చెప్పారు. మన పూర్వీకులందరూ ఆస్తిక భావనతో శ్రేయస్సు పొందారు. మనం వారిని విస్మరించకుండా ఉండాలంటే అదే భావనలో పెరగాలి. అదే మార్గంలో మెలగాలి. భగవంతుడు మనల్ని ఎలా రక్షిస్తాడని కొందరు వేసే

ప్రశ్న. కాని జీవన విధానంలోని అనుభవాలను గుర్తెరగని వారు వేసే ప్రశ్న అది. దైవం మానవులను పశువుల కాపరి తమ పశువులను రక్షించే విధంగా రక్షిస్తూ శిక్షిస్తూ ఉంటాడు ఎవరిని రక్షించదలచుకున్నాడో వారికి సత్ప్రేరణ కలిగిస్తాడు. మన ఆలోచనా విధానంలో చెడ్డ తలంపులకు కూడా భగవంతుడే కారణమైతే మన దోషమేమిటని అడగవచ్చు. కాని చెడ్డ తలంపులు పాపకర్మ ఫలం. అంతే కాని భగవంతుడు నిర్దయుడూ కాదు, పక్షపాతి అంతకన్నా కాడు అని వ్యాస భగవానుడే చెప్పాడు. భగవంతుని విధులు కోర్టులో తీర్పుయిచ్చే న్యాయాధికారి విధుల వంటివే. జడ్జి తన యిష్టం వచ్చినట్లుగాక కొన్ని న్యాయసూత్రాలకు లోబడి శిక్ష విధిస్తాడు. శిక్షార్హత ప్రకారం తీర్పు యిస్తాడు. ఇందువలన మనం తెలుసుకో వలసింది ప్రతిదానికి ఒక చట్టం ఉందని ఆ చట్టం మనం ఉల్లంఘిస్తే మన వ్యవస్థే పతనం అవుతుందని చెప్పారు. భగవంతుడు అలాంటి చట్టంగా వేదశాస్త్రాన్ని యిచ్చారు. పుణ్యకర్మలకు పుణ్యఫలాలు అందుకోవచ్చు. సుఖాన్ని బడయవచ్చు.

## పుణ్యకర్మ

పుణ్యేవ కర్మణః పుణ్యభవతి
పాపేన పాపా భవతి

క్రిందటి జన్మలో మంచి కర్మ చేసినవాడు ఈశ్వర ప్రేరేపణవల్ల అలాచేసి శ్రేయస్సు పొందుతాడు. ప్రతి జన్మ వెనుక జన్మకు, వెనుకటి జన్మ అంతకుముందు దానికి ముడిబడి ఉన్నది. సృష్టి అనాది. కల్పానికి ఆది. వెనుక ఎన్నో కల్పాలు అయినాయి. కోట్ల సంవత్సరాలు ఒక కల్పం.

## ఆత్మస్థైర్యం

మానవ హృదయాంతరాళాల్లో వ్యాపించి చరింపజేసే వాడు ఈశ్వరుడు. "ఈశ్వర సర్వభూతాని". ఈ విషయం తెలిసిన తరువాత సంకుచితమైన సంశయాలకు తావులేదు. ఇది మనమే చెప్పటం మొదలెట్టలేదు. కొన్ని వేల సంవత్సరాలుగా వస్తున్న భావనే అది. ఈశ్వరతత్వం ఉపాదానమైనది. ఈశ్వరుని ఉనికిని గూర్చి మరచిపోకుండా గుర్తుచేయగలందులకే దేవాలయాలు ఉన్నాయి. అయితే దేవాలయాల్లోనే ఈశ్వరుడున్నాడా అంటే, దృఢ సంకల్పం లేనివారికి, ఆత్మస్థైర్యం లేనివారికి, పరిపక్వత రానివారికి దేవాలయాలు కావాలి. ప్రహ్లాదుడులాంటి స్థితప్రజ్ఞులకు దేవాలయాలతో కాని, పూజాదికములతో కాని పనిలేదు. కాని సాధారణ మానవులకు నమ్మకం సడలుతూ, సంస్కారం సన్నగిల్లుతూ ఉంటుంది కాన భగవన్ముఖు లగుటకు దేవాలయాలూ కావాలి, సత్సంగాలూ కావాలి. భగవంతుని అనుగ్రహానికి దర్శనం, స్పర్శనం, పూజనం, మొదలగు కర్మమార్గాలు అవశ్యం.

## నిశ్చల భక్తి

భగవంతునికి ఏమి సమర్పించి సంతృప్తి పరచగలడు భక్తుడు. శంకర భగవత్పాదులు చెప్పినట్లు బంగారు పర్వతం తన చేతిలో కలవాడు, కుబేరుడు తన దాసునిగా

## గ్రంథాలయములు

" జీవితానికి అన్నం ఎంత అవసరమో గ్రంథాలు అంతకంటే ఎక్కువ అవసరం కాకపోయినా తక్కువ అవసరం మాత్రం కావు. అన్నం శరీరంలోని ఆకలిని తీర్చి శరీర పోషణకు తోడ్పడితే, గ్రంథాలు మానసంలోని ఆకలిని తీర్చి మానసిక పోషణకు దోహదం చేస్తాయి. "

డా॥ సంజీవదేవ్

పొందినవాడు, కల్పవృక్షం, కామధేనువు తన అధీనంలో ఉన్నవాడికి భక్తుడు ఏమి ఈయగలడు ? అత్యంత శీతలమైన చంద్రుడు తన శిరస్సునే కలిగి, సమస్త మంగళాలు పాదాలచెంత ఉన్నవాడికి భక్తుడు ఈయగల్గింది తన మనోసుకుసుమాన్ని మాత్రమే. అయితే అది కనబడనిది కాన దానికి ఆధేయంగా భగవన్నామం, మననం సతతం చేయడమే మార్గం. దీనికి గోపికా స్త్రీలను ఆదర్శంగా తీసుకోవాలి. వారు పాలు పెరుగూ అమ్ముకోడానికి వెళ్ళి గోపాలుని నామం పెద్దగా అంటూ తిరిగేవారట. " గోవింద, దామోదర, మాధవేతి " అని అరచేవారట. అది నిశ్చల భక్తితత్వం. పరాత్పరుని మనస్సునుండి పది సెకన్లు అయినా పోనీయక బంధించి వుంచాలి. అయితే ఈశ్వరులు చాలామంది వున్నారా ? భారతీయులకు ముప్పదిమూడు కోట్ల దేవతలు గదా ? అని అడిగితే సిద్ధాంతరీత్యా :

### భగవంతుడు ఒక్కడే

" ఏకోదేవః సర్వభూతేషు గూఢః " అని. భగవంతుడొక్కడే. రూపం వేరుగా భక్తులు చూచుకోవచ్చు. కొలుచుకోవచ్చు. మామూలు మానవుడు కూడా బహు రూపాలుగా అంటే ఇంట్లో తండ్రి, బయట గురువు, మరొకచోట శిష్యుడు ఇంకొకచోట భర్తలాగా వున్నట్లే. ఉపాసకుల సౌకర్యంకోసరం భగవంతుడు బహు రూపాలలో వ్యక్తం అవుతున్నాడు.

కృష్ణా అష్టమి, శివరాత్రి ఒకే విధంగా పవిత్రమైనవి. పర్వ దినాలు మన పూర్వీకులు ఏర్పరిచింది కూడా భగవత్ తత్వాన్ని తెలుసుకొని జ్ఞప్తియందు వుంచుకోడానికే. అన్ని మూర్తులలో లేక అవతారములలో భగవంతుడు ఆరాధ్యుడే. అందుకే నిత్యం సంధ్యావందనంలో 3 సార్లు జపించి ఎక్కువగా గుర్తుంచుకొనవలసినది.

"శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే"

అని భగవంతుడు పీతాంబరుడైనా, దిగంబరుడైనా, గరుత్మంతుడు వాహనంగా విహరించేవాడైనా, కాళిందీ మర్దనుడైనా, ఒక్కడే అనే సిద్ధాంతాన్ని గ్రహించి ఆయన ఆరాధన ద్వారా శ్రేయస్సు పొందాలి.

### స్వ ధర్మం

స్థానిక హిందూ కళాశాల హైస్కూల్ ఆవరణలో శ్రీ భారతీ తీర్థస్వామివారు స్వధర్మం గూర్చి వివరించారు. జ్ఞాన ప్రాప్తికి స్వధర్మానుష్టానం అవసరమన్నారు. ధర్మం సాధించకుండా మిగతావి సాధిద్దామనుకోవడం పొరపాటు. వేద విహితమైన ధర్మం మోక్ష ప్రాప్తికి మూలం అన్నారు. శాస్త్రోక్తరీతిలో ధర్మానుష్టానం చేయాలన్నారు.

స్వధర్మే నిధనం శ్రేయః
తస్మాత్ శాస్త్రం ప్రమాణంతే
కార్యా కార్య వ్యవస్థితౌ ॥

అని భగవద్గీతలో అందుకే భగవంతుడు వక్కాణించాడు. భగవత్పాదులు కూడా " గీత " విశిష్టత తెలుపుతూ :

" గేయం గీతానామ సహస్రకం " అన్నారు.

ప్రతివారు ప్రతినిత్యం గీతాధ్యయనం యథాశక్తి చేయడం అవసరమని, శ్రేయోదాయకమని శ్రీచరణులు తమ ప్రసంగం ఉపసంహరించి తమ ధర్మయాత్ర మరొక గ్రామానికి కొనసాగించారు.

— డా॥ పి. జి. కృష్ణమూర్తి

# హిందువంటే ఎవరు ?

మమతతో అభివృద్ధిగాంచేది మానవత్వము. సత్య ధర్మ శాంతి ప్రేమ అహింసలు మానవత్వ ప్రధానమైన ప్రాణాలు. ఈ పంచప్రాణాలు మానవత్వాన్ని వికసింపజేసి, ప్రకటింపజేసి, ఆచరింపజేసి ఆనందాన్ని అందింపజేసేవి. మానవుని చరిత్ర ప్రధానం. వ్యక్తిత్వం ఆధారం. జాతీయత, పవిత్రత, ఐకమత్యం ముఖ్యతత్త్వాలు. చరిత్ర, వ్యక్తిత్వం, జాతీయత, దివ్యత్వం, ఐకమత్యం-ఇవికూడా భారతీయ శాస్త్రంలో పంచసూత్రాలు. ఆంగ్లేయులు భారత దేశానికి హిందూదేశమని పేరు పెట్టినప్పటికీ, మౌలికమైన భారతీయ తత్త్వాన్ని మాత్రం మార్చలేకపోయారు. భారతీయులను వంచించదలచి హిందూ అనే పదమును ప్రయోగించినప్పటికీ ఇందులో కూడా పంచ ప్రాణ సూత్రాలు ప్రకాశిస్తూనే వున్నాయి. ఆంగ్లంలో హిందూ 'Hindu' అనే పదములో ఐదు అక్షరాలున్నాయి. 'H, హెచ్ అనగా History చరిత్ర. 'I' అనగా Individuality వ్యక్తిత్వం. 'N' అనగా Nationality జాతీయత. 'D' అనగా Devotion లేక Divinity భక్తి లేదా దివ్యత్వం. 'U' అనగా Unity ఐక్యత లేదా ఏకత్వం. హిందూ Hindu అనే పదములోకూడా చరిత్ర, వ్యక్తిత్వం, జాతీయత, దివ్యత్వం, ఏకత్వం – అనే పంచప్రాణాలు, పంచసూత్రాలుగా నిలిచియున్నవి. భారతీయులకు చరిత్ర ప్రధాన ధర్మం. వ్యక్తిత్వమే నిజమైన జాతీయత. వ్యక్తిత్వాన్ని పెంచుకున్నప్పుడే దివ్యత్వం మనలో ఆవిర్భవిస్తుంది. ఈ పవిత్ర దివ్యత్వమే ఏకత్వమనే మోక్షానికి ఆధారంగా నిలుస్తుంది.

## పది సూత్రాలు

ఈనాడు ముఖ్యంగా నేను పది సూత్రాలు చెప్పదలచుకున్నాను.

**1. జననీ జన్మభూమిశ్చ :**

జన్మభూమి కన్నతల్లి వంటిది. ప్రతి మానవుడు దేశాభిమానం కలిగివుండాలి. ఏయే దేశాలవారు, ఆయా దేశాల పట్ల అభిమానం కలిగివుండడంలో దోషంలేదు. తన దేశాన్ని అభిమానించినంత మాత్రాన పరదేశాన్ని విమర్శించాలనిలేదు. ఒక దేశాన్ని విశ్వసించినంతమాత్రం చేత మరొక దేశాన్ని ద్వేషించడం తగదు. కలలో, ఊహల్లోకూడా దేశద్రోహానికే మాత్రం అవకాశాన్ని అందించరాదు. ప్రతి వ్యక్తికి దేశాభిమానం చాలా ముఖ్యమైనది.

శ్రీ సత్య సాయి బాబా

**2. సర్వమతాదరణ:**

ఏ మతాన్నీ ద్వేషించక సర్వమతాలను ఆదరించాలి, గౌరవించాలి.

**3. సోదరత్వం :**

ప్రతి మానవుని సోదరునిగా భావించి ప్రేమించాలి. మనందరి జాతి ఒక్కటే. అది మానవజాతి. మానవ జాతిలో పుట్టినాము గనుక మానవులందరూ ఒక్కటే అనే సత్యాన్ని గుర్తించి సర్వమానవులను ప్రేమించాలి.

**4. పరిశుద్ధం**

గృహ పరిసరాలను పరిశుద్ధంగా వుంచుకోవాలి. తన గృహమునే గాక పరిసర ప్రాంతాలను కూడా పరిశుద్ధపరచుకోవడంచేత ఆరోగ్య ఆనందములు చేకూరుతాయి.

**5. దానం :**

భారతదేశంలో దానం పేర, దేశానికి ద్రోహం జరుగుతున్నది. దానమనగా దేశమంతటా భిక్షగాళ్ళను తయారు

# భారతీయ సంస్కృతి

భారతదేశంలోని నదుల నామములే ఈజిప్టులో కూడా కలవు. ఈజిప్టులోని నైలు నదిని పూర్వము నీలానది అని పిలిచేవారు. ప్రాచీన ఈజిప్టు రాజుల సింహాసనమునకు ఒకవైపున హిమవంతుని విగ్రహము, మరొక ప్రక్కన గరుత్మంతుని విగ్రహము వుండేవి. 'ఇస్వి' అనునది వారి దేవుని పేరు. ఇది 'ఈశ' అను శబ్దము నుండి వచ్చినట్లు చరిత్రకారులు చెబుతున్నారు.

చేయడం గాదు. భిక్షగాళ్ళకు ఒక ఉపాధిని కల్పించవచ్చునేగాని, దానం అలవాటు చేయకూడదు. వీరికి ఉపాధి కల్పించి, ఏదైనా ప్రదేశంలో ఏర్పాట్లు గావించి, కాల కాలానికి ఆహారము, వస్త్రము ఇస్తూ అనుకూలమైన వాతావరణము కల్పించవచ్చునేగాని బజారులో అడ్డ మొచ్చిన వారికంతా డబ్బులిచ్చి భారతదేశమంతా భిక్షగాళ్ళే అని చెడ్డపేరు తేరాదు. మనం భిక్షమివ్వడం చేతనే పట్టణాలలో, పల్లెలలో సోమరత్వాన్ని పెంచుకొని భిక్షగాళ్ళుగా తయారవుతున్నారు.

6. లంచం :

లంచం యిచ్చి పని చేయించుకోవడంగాని, లంచం పుచ్చుకొని పనిచేయడం గాని ఏ మాత్రం మంచిది కాదు.

7. విశాల భావం :

పరస్పర ద్వేషాలు, అసూయలు అరికట్టుకోవడానికి విశాల భావాన్ని పెంచుకోవాలి. విశాల భావం కలగాలంటే జాతి మత బేధాలకు అవకాశం యివ్వకూడదు. మీ పద్ధతులను మీ గృహాలలో ఆచరించుకోవచ్చునుగాని, సమాజంలో వీటిని పాటించడంచేత ప్రమాదాలు సంభవిస్తాయి. ఒకరిని వంచించడం, మరొకరిని అభివృద్ధి గావించడం జరుగుతూ వుంటుంది. అట్లుగాక సమాజంలోవున్న ప్రతి ఒకర్ని సోదరభావంతో, విశాలభావంతో ప్రేమించాలి. జాతి మత భేదాలను ఏ మాత్రం పెంచుకోరాదు.

8. స్వయం సేవ :

తమ పనులను తామే చేసుకోవాలి. తమ పనులను తాము చేసుకోలేనివారు సమాజసేవ ఏ రీతిగా చేయగలరు? కొందరు శ్రీమంతులై వుండవచ్చు. వారు సేవక పరివారాన్ని పెట్టుకోవచ్చును. కొన్ని పనులకు వారిని ఉపయోగించవచ్చును. కాని తన స్వంతపనులను కూడా, ఆ పనివారితో చేయించుకోవడం కేవలం సోమరత్వం. ఇట్టి సోమరత్వానికి మరిగిన వ్యక్తి సమాజసేవ చేయలేడు.

9 పాప భీతి దైవ ప్రీతి :

ఇది ప్రతి ఒక్కరికీ ఉండవలసిన సద్గుణం నిరంతరం భగవంతుని ప్రేమించాలి. పాపాన్ని ద్వేషించాలి. పాపాలు చేస్తున్నంతకాలం దైవం చిక్కడు.

10. చట్టాలను గౌరవించాలి

ప్రభుత్వ చట్టనిబంధనలను ఏ మాత్రం అతిక్రమించరాదు. చట్టాలను గౌరవించడం నేర్చుకోవాలి. చట్ట విరుద్ధమైన చర్యలను ప్రోత్సహించరాదు.

ఈ పది సూత్రాలను మీ హృదయాలలో ప్రతిష్ఠించుకొని క్రమశిక్షణను పాటించుకుంటూ సాయి సంస్థలను అభివృద్ధి పరచాలి. ఎవరియందు ఎట్టి దోషాలున్నా, మనమా దోషాల నెంచక వారిని ప్రేమించి, వారితో సహకరించి ప్రేమను అభివృద్ధి పరచుకోవాలి.

(ది 21-11-85 సాయంకాలం ఉపన్యాసంనుండి)

# వంద దేశాల విద్యార్థులు చదివే యూనివర్సిటీ

## మనకు తెలియని ప్రపంచం

మల్లాది వెంకటకృష్ణమూర్తి

రష్యాలోని అతి పురాతనమయిన, అతి పెద్దదయిన యూనివర్సిటి "మాస్కో యూనివర్సిటి". 1755 లో ఇది స్థాపించబడింది. ఇందులో 20 వేలమంది విద్యార్థులు చదువు తున్నారు. ఈ యూనివర్సిటీకి ఓ పార్కు, ఓ బొటానికల్ గార్డెన్, ఒక అబ్జర్వేటరీ, 27 పెద్ద భవంతులు, వాటికి అనుబంధంగా 10 చిన్న భవంతులువున్నాయి. ఇవన్నీ 320 హెక్టార్ల పరిధిలో విస్తరించుకొని వున్నాయి. ఈ యూనివర్సిటీకి వున్న అన్ని బిల్డింగ్స్, లేబరేటరీలలో **నడిస్తే మొత్తం** 200 కిలోమీటర్ల దూరం నడచినట్లవు తుందంటే అది ఎంత పెద్దదో వూహించవచ్చు.

దీంట్లో 250 డిపార్ట్‌మెంట్స్ వున్నాయి. రీసెర్చి కోసం, బోధన కోసం 350 చిన్నా పెద్దా లేబరేటరీలు వున్నాయి. ప్రొఫెసర్స్ సంఖ్య వేయికి పైనే. మిగతా స్టాఫ్ 4,500 మంది దాకా వున్నారు.

రష్యాలోని అన్ని ప్రాంతాల నుంచి వచ్చి ఈ యూనివర్సిటిలో చదువుతున్నారు. ఒక్క రష్యాదేశం నుంచే కాదు విదేశాల నుంచి కూడా వచ్చి, మాస్కో యూనివర్సిటీలో చదివే విద్యార్థులున్నారు. దాదాపు వంద దేశాలనుంచి 2,500 మంది విదేశీ విద్యార్థులు దీంట్లో విద్యాభ్యాసం చేస్తున్నారు. అలా వచ్చే విద్యార్థులు ముందర విధిగా రష్యన్ భాషని నేర్చుకోవాలి. ఆ భాష క్షుణ్ణంగా వచ్చాకే విద్యాబోధన ప్రారంభమవుతుంది. అన్ని కోర్సులు ఇక్కడ రష్యన్ భాషలోనే బోధిస్తారు.

మాస్కో నగరవాసులు మినహాఇస్తే మిగతా విద్యార్థులంతా హాస్టల్స్‌లో వుంటారు. ప్రతినెల కొంత స్టయిఫండ్ ఖర్చుల కోసం యూనివర్సిటి విద్యార్థులకి ఇస్తుంది. ఇది విదేశీ విద్యార్థులకి కూడా వర్తిస్తుంది. ఇదేకాక అందరికీ వైద్య సౌకర్యాలు కూడా వుచితం.

ప్రతి సంవత్సరం టీ పార్టీని మొదటి సంవత్సరం విదేశీ విద్యార్థులు ఏర్పాటు చేస్తారు. అంతర్జాతీయంగా వాసికెక్కిన ఈ యూనివర్సిటీకి కేవలం రష్యన్ దేశ సెలవులే కాక విదేశాల్లోని ముఖ్య సందర్భాలకి అనుగుణంగా కూడ సెలవులుంటాయి.

ప్రతి విదేశ విద్యార్థులు తమ దేశ విద్యార్థులతో కలసి ఓ అసోసియేషన్‌ని స్థాపిస్తారు. తమ దేశానికి చెందిన ఓ ముఖ్యమైన రోజున పత్రిక విలేఖరులని, తమ దేశ ఎంబసీ స్టాఫ్‌ని, విదేశ, రష్యన్ విద్యార్థులని పిలిచి పార్టీ ఇస్తుంటారు. భారతీయ విద్యార్థుల సంఘం సాధారణంగా రిపబ్లిక్, ఇండిపెండెన్స్ రోజుల్లో అలాంటి పార్టీలని ఇస్తుంటారు. ★

# అమర గాయకుడు తాన్‌సేన్

( క్రీ. శ. 1550 – 1600 )

గ్వాలియర్ సమీపంలోని చిన్న పల్లెటూరు బెహిర్. ఆ గ్రామం మకరందపాండే అను కవికి నిలయం. అన్ని సంపదలున్నా పుత్రసంపద లేని పాండేకు, మహమద్‌గౌస్ అను ముస్లిమ్ భక్తుని అనుగ్రహం వల్ల కుమారుడు జన్మించాడు. ఆ సాధువు శిశువుకు 'తన్నా' అని నామకరణం చేశాడు. ఆ తన్నాయే కాలక్రమంలో, తాన్‌సేన్ అయ్యాడు. పూర్వజన్మ సంస్కారం వల్ల తన్నా చిన్నతనంలోనే సంగీతంలో దిట్ట అనిపించు కొన్నాడు. అతని పుణ్యం కొద్దీ బృందావనంలో నివసిస్తున్న భక్తకవీ, వాగ్గేయకారుడూ అయిన స్వామి హరిదాస్ తన్నాను చేరదీశాడు. హిందూస్తానీ సంగీత రహస్యా లన్నీ బోధించాడు. గొప్ప వైణికునిగా రూపొందించాడు. స్వామి హరిదాస్ ఆశీస్సులతో తాన్‌సేన్ 'భూలోక గంధర్వుడు' అనిపించుకున్నాడు.

## జానమద్ది హనుమచ్ఛాస్త్రి

తాన్‌సేన్ సంగీత ప్రతిభా పరిమళాలు ఉత్తర భారత మంతటా వ్యాపించాయి. అక్బర్ చక్రవర్తి తాన్‌సేన్‌ను తన ఆస్థాన గాయకునిగా నియమించాడు. తాన్‌సేన్ హిందూ దేవతలను గురించి అక్బర్ గుణగణాలను గురించి పెక్కు కీర్తనలను రచించాడు. తాన్‌సేన్ పాటలు ఉత్తరదేశంలోని భజనల్లో ఎక్కువగా విని పిసాయి.

హిందూస్తానీ సంగీతంలో 'ద్రుపద్' బాణీలో పాడటం కష్టం. ద్రుపద్ శైలిని రూపొందించి ప్రచార మొనర్చిన సంగీత కళానిధి తాన్‌సేన్. సూరదాస్, మీరాబాయి తులసీదాస్ వంటి మహనీయులు యీతని సమకాలీనులు.

తాన్‌సేన్‌కు నలుగురు కుమారులు ఒక కూతురు. సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడూ తాన్‌సేన్ శిష్యుడూ అయిన సౌబత్‌ఖాన్ తాన్‌సేన్ కూతురు సరస్వతిని వివాహం చేసుకున్నాడు. తాన్‌సేన్ జ్యేష్ఠ పుత్రుడైన బిలాస్‌ఖాన్ తండ్రిని మించిన తనయుడుగా సంగీత ప్రపంచంలో పేరు గడించాడు.

తాన్‌సేన్ కేవలం గాయకుడే కాక మహిమాన్వితుడని ప్రస్తుతింపబడ్డాడు. ఒకనాడు అక్బర్ చక్రవర్తి దర్బారులో తాన్‌సేన్ పాడుతున్నాడు. మధ్యాహ్నం ప్రారంభమైన కచేరి చీకటిపడినా సాగుతూనే వుంది. తన్మయులై వింటున్నారందరూ. దీపాలు వెలిగించటం కూడా మరచి పోయారు పరిచారికులు. ఆస్థాన గౌరవాన్ని ఎరిగిన తాన్‌సేన్ దీపకరాగం పాడనారంభించాడు. దైవదత్తమైన ప్రతిభగల తాన్‌సేన్ రాగాలాపన చేయగనే సభా భవనం జ్యోతిర్మయమైంది. ఆ పాట పూర్తి కాగానే చీకట్లావరించాయి. తాన్‌సేన్ సంగీత మహిమకు ముగ్ధుడైన అక్బర్ అతనిని 'సంగీత భాస్కరుడు' అని ప్రశంసించాడు.

ఒకమారు దేశంలో పలుచోట్ల అనావృష్టి తల ఎత్తింది. అక్బర్ అభ్యర్థన మేరకు తాన్‌సేన్ మేఘమల్హార్ రాగం ఆలాపన చేయటంతో కుండపోతగ వానలు కురిశాయి. అక్బర్ అతని గానామృతవృష్టికి పులకించి పోయాడు.

అక్బర్ చక్రవర్తి తాన్‌సేన్ ప్రతిభకు జోహారర్పించి, మిమ్మ మించిన గాయకుడీ దేశంలోనే లేడు. మీకింతటి సంగీత మాధుర్యం ఎలా లభించింది ? అని ప్రశ్నించాడు.

" ప్రభూ నేనెంత ! నా సంగీత మెంత ! ఇదంతా మా గురుదేవుల అనుగ్రహం " అన్నాడు.

" అయితే మీకంటే మీ గురువుగారు యింకా గొప్ప గాయకులా ? " అని అడిగాడు పాదుషా.

తాన్‌సేన్ సవినయంగా సమాధానమిస్తూ " ప్రభూ, మా గురువుగారి సంగీత ప్రతిభలో శత సహస్రాంశం కూడా నాకు లేదు " అన్నాడు.

" అంత గొప్ప గాయకులు మా దేశంలో వున్నట్లు మీరెప్పుడూ చెప్పలేదే ! అయితే మీ గురువుగారిని మా దర్బారుకు ఆహ్వానిద్దాం. వారిని ఘనంగా సత్కరిద్దాం" అన్నాడు పాదుషా.

" వారు దర్బారు సన్మానాలకు దూరంగా వుంటారు " అన్నాడు తాన్‌సేన్.

ఆశ్చర్యచకితుడైన అక్బర్ " అలాగా అయితే మనమే వారి సందర్శనానికి వెళ్దాం, వారి సంగీతం వినాలని వుంది " అన్నాడు.

మరుసటిరోజు ఉదయాన్నే తాన్‌సేన్ అక్బర్‌లు మారువేషాలతో హరిదాసస్వామి ఆశ్రమానికి వెళ్ళారు. స్వామి ఒక చెట్టుక్రింద కూర్చొని తన్మయులై భగవంతుని గుణగానం చేస్తున్నారు. ఆ గాన మాధుర్యానికి అక్బర్ పాదుషా ముగ్ధుడయ్యాడు.

" తాన్‌సేన్ మీ గురువుగారి సంగీతం పరమాద్భుతం. వారి సంగీత విద్య మీకింకా పూర్తిగా వట్టుబడలేదు. ఎందువల్ల ? " అని ప్రశ్నించాడు అక్బర్.

తాన్‌సేన్ మౌనంగా వుండిపోయాడు. అక్బర్ చక్రవర్తి మరీమరీ ప్రశ్నించగా తాన్‌సేన్ " ప్రభూ వారి గానవిద్య నాకెలా సాధ్యమవుతుంది ? నేను ఢిల్లీశ్వరుని మెప్పుకోసం పాడుతాను. మా గురుదేవులు జగదీశ్వరుని అనుగ్రహం కోసం పాడుతారు "

అక్బర్ హరిదాసస్వామి వారికి పాదాభివందన మొనర్చి సెలవు తీసుకున్నాడు.

తాన్‌సేన్ అంతిమ ఘడియల్లో అక్బర్ అతని ప్రక్కనే వున్నాడు. కుమారుడు తండ్రి ప్రక్కనే వుండి దుఃఖావేశంలో గానం చేస్తుండగా తాన్‌సేన్ కుడిచేయి ఎత్తి అతనిని ఆశీర్వదించాడు. అక్బర్ పాదుషా గ్వాలియర్‌లో

**జాగృతి**

ఆకాశం
అంతా శూన్యమని
అలమటించకు –
తూర్పుకు చూడు
మార్పు కోరి
తిమిరంతో
సమరం చేస్తున్న
సూర్యుడు కనిపిస్తాడు !

– సి. కామేశ్వరరావు

తాన్‌సేన్ సమాధి నిర్మాణం కావించాడు. తాన్‌సేన్ చివరి క్షణాల్లో బిలాస్‌ఖాన్ పాడిన రాగం " బిలాస్‌ఖాన్" తోడి రాగంగా ప్రశస్తి గాంచింది.

తాన్‌సేన్ సంగీతసారం, రాగమాల అన్న లక్షణ గ్రంథాలను రచించాడు. అందరూ అతనిని మియా తాన్‌సేన్ అని పిలిచేవారు. మియామల్హార్, మియాతోడి, మియా సారంగ్, దర్బార్ మున్నగు విశిష్ట రాగాలను సృష్టించిన సంగీత కళాకోవిదుడు తాన్‌సేన్.

ఆ మహనీయుని గానం విన్న ప్రజలు ధన్యులు. అక్బర్ పాదుషా ధన్యుడు. ఆ కాలమే ధన్యమైంది.

తాన్‌సేన్‌ను హిందువులు హిందూగా, ముస్లిములు ముస్లిమ్‌గా భావించేవారు. మతాలకు, కులాలకు అతీతంగా సంగీతామృతాన్ని పంచిపెట్టిన మహా మానవుడు తాన్‌సేన్.

దక్షిణ భారతంలో తిరువయ్యార్‌లో శ్రీ త్యాగరాజ స్వామి ఆరాధనోత్సవాల వలె, ఉత్తర భారతంలోని గ్వాలియర్‌లో తాన్‌సేన్ ఆరాధనోత్సవాలు ప్రతి ఏటా అత్యంత వైభవంగా జరుగుతాయి. 

మెట్లు దిగివస్తున్న ఎనభైఏళ్ళ తండ్రిని చూశాడు హాల్లో కూర్చుని పేపరు చదువుతున్న సత్యం తలెత్తి.

ఒక్కొక్క మెట్టు మీద చేతికర్రని ఆన్చి, మెల్లగా దిగుతున్నారు వినాయక రావుగారు.

టైమ్ ప్రొద్దున్న ఏడు గంటలయ్యింది. బయట ముసురు పట్టింది. చిన్న వానజల్లు పడుతోంది.




యీయన ఎక్కడికి వెళ్దామని? గుడికా? అసలే ఆరోగ్యం బాగులేదు వానలో ఎందుకూ? అనుకున్నాడు సత్యం.

“ గుడికా నాన్నా ? ” అన్నాడు.

“ ఆఁ, అవున్రా, వానపడుతోందే ! ” ఆశ్చర్యంగా అన్నారు వినాయకరావుగారు.

తన పరధ్యానంలో ఆయన వాన సంగతే పట్టించుకో లేదు.

“ అవును. యిప్పుడు చిన్నజల్లు. కొంతసేపటికి ఎక్కువయ్యేట్లుంది. యివ్వాళ మానేయకూడదూ. అసలే జలుబూ దగ్గూ వున్నాయి కదు నాన్నా ” కొంత విసుగూ, కొంత జాలితో అన్నాడు సత్యం.

“ అబ్బే, అదెలాగరా. ఎన్ని అడ్డంకులు వచ్చినా, ఆ స్వామిని ఒకసారి చూసుకుని రాకపోతే యింక ఏం ప్రయోజనం ! అదీగాక, శుక్రవారం యివ్వాళ. ఆ రాముడికి పట్టుబట్టలూ, కవచం అలంకారం చేస్తారు. కన్నుల పండుగ ” తన్మయత్వంతో అన్నారు వినాయక రావుగారు.

“ నాన్నా, మీ సంతోషం బాగానే వుంది. కాని కొంత ఆరోగ్యం కూడా చూసుకోవాలి. మీరు డాక్టరు. మీకు నేను చెప్పాల్సిన వాడిని కాదు. అయినా సైన్సు చదివిన మీరు, అందులో డాక్టరు, ఒకప్పుడు సర్జన్ ! మరీ, మీకు యింత చాదస్తం అయితే ఎలా నాన్నా. యింట్లో పూజ చేస్తున్నారు. మళ్ళీ గుడికెళ్ళి ఆ భగవంతుడిని తప్పని సరిగా చూడాలా ! నిజంగా భగవంతుడున్నాడనుకుంటే, అన్నిచోట్లా వుంటాడు కదా, మన పూజ గదిలోనే వున్నా

డనుకుని యిక్కడే చూసుకోరాదూ, ఆ దేముడిని" అన్నాడు సత్యం అసహనంగా.

"నీకు భగవంతుడి మీద నమ్మకం పోయిందేంట్రా ?" కొడుకుని జాలిగా చూస్తూ అన్నారాయన.

"యీ రోజుల్లో జరుగుతున్న అక్రమాలూ, అన్యాయాలూ చూస్తుంటే భగవంతుడి మీద నమ్మకం పోయింది నాన్నా. యిదంతా చాదస్తం. దేముడి గుడిలోనే నమ్మలేని సంఘటనలూ, అన్యాయాలూ, అవినీతి కన్పిస్తున్నాయి ; యింక భగవంతుడి మీద నమ్మకం ఎలా నిలుస్తుంది ? గుడిలో దేముడుంటే తన ముందే జరుగుతున్నది ఎందుకు చూస్తూ వూరుకుంటున్నాడు ?" కోపంగా అన్నాడు సత్యం.

నలభై ఆరేళ్ళ కొడుకు యిలా మాట్లాడేటప్పటికి, వినాయకరావుగారికి నవ్వొచ్చింది. నవ్వుతూంటే దగ్గొచ్చింది. దగ్గుతూ, తూలారాయన.

చటుక్కున లేచి తండ్రిని పట్టుకున్నాడు సత్యం.

"జాగ్రత్త నాన్నా, ఎందుకంత నవ్వు ?" వింతగా చూస్తూ, తండ్రిని సోఫాలో కూర్చోబెట్టాడు.

జరాభారం వలన వినాయకరావుగారి చేతులు వణుకుతున్నాయి. ముడతలు పడిన చర్మం ఆయన నవ్వుతూంటే కదులుతోంది. ఆయన కళ్ళు మాత్రం వింత కాంతితో నిండి, నిశ్చలంగా కొడుకుని చూస్తున్నాయి.

"ఒరేయ్, ఎప్పుడేం చెయ్యాలో, ఆ భగవంతుడికి తెలుసురా. పాపం చేశాకే కదా ఆయనైనా శిక్షిస్తాడు. ఆయన లీలలు నీకూ, నాకూ అర్థమవుతాయనే ! నేను గుడి కెళ్ళడానికి కారణం, అరవిందయోగి చెప్పినట్లు దేముడికి స్వరూపం వుందని నమ్మడం వలన. అక్కడున్న రూపాన్ని దైవస్వరూపంగా భావిస్తాను. యింక గుడిలో దేముడికి, మన పూజగదిలో వున్న దేముడికి వ్యత్యాసం అంటావా, భగవంతుడిలో వ్యత్యాసం ఏమీ లేదు. భేదమల్లా ప్రతిష్ఠించడంలో వుంది. గుడిలో మంత్రాలతో ప్రాణ ప్రతిష్ఠ జరుగుతుంది. యిక్కడ జరగలేదు. అక్కడ ఆయన వైభోగం ఎక్కువ. యిక్కడ నేను



## అంకితం

"ఛీ, ఏమిటీ దౌర్భాగ్యపు లోకం, ఏమిటీ దౌర్భాగ్యపు మనుషులు! భగవంతుడా మోక్షమియ్యి." అని కష్టాలతో ప్రాణం విసిగెత్తి అనుకున్నప్పుడల్లా, "ఇది నా లోకం, ఇది నా మాయ. ఇందులో నీచులున్నా, వారి మధ్యలో, వీళ్ళ రూపంలో నేనూ వున్నాను" అన్నట్లు తన అంశ కల్గిన పెద్దమనుషుల రూపంలో కనిపించి, నాకు అండగా నిలిచి, నాకష్టం భరించలేక పిలిచినప్పుడల్లా, "నన్ను నమ్మిన నిన్ను నట్టేట్లో ముంచను" అన్నట్లు, ఏదో ఒకవిధంగా కాపాడుతున్న ఆ శ్రీరామచంద్రుడి పాద పద్మాలకు యీ నా-కల్పితం లిఖితం — అంకితం.

- రచయిత

అంత చేయలేను ! అవకాశం దొరికినంత వరకూ, ఆ పెరుమాళ్ళని అందరూ స్తుతిస్తూ, పూజిస్తూవుంటే నేనూ పాల్గొనాలనే. ఆర్తులూ, జిజ్ఞాసులూ, అర్థకాములూ, ఆయనకు నమస్కరిస్తూంటే భగవంతుడి అవసరం మనకెంతుందో అర్థమవుతుంది" నవ్వుతూ అన్నారాయన.

"చూశారా, మీరే అన్నారు భగవంతుడి అవసరం అని. అంటే కేవలం ఒక ఆలంబన కోసం అందరూ గుడికి వెళుతున్నారు. నిజంగా ఎవరి పనులు వాళ్ళే చేసుకోగలిగితే ఎవ్వరికీ యీ దేముడి అవసరం లేదనే కదా ! అనుకున్నవన్నీ జరిగిపోటల్లేదు కాబట్టి ఏదో ఆశతో భగవంతుడున్నాడేమో, చేస్తాడేమో, అని పరిగెడుతున్నారు. యిది అజ్ఞానం" ఆవేశంగా అన్నాడు సత్యం.

వినాయకరావుగారు కొడుకువైపు సాలోచనగా చూశారు.

బయట పెద్దవాన ప్రారంభమయ్యింది.

ఆయన గొంతు సవరించుకున్నారు.

" భగవంతుడున్నాడూ, ఆయన క్షమిస్తాడూ, కోరినవి చేస్తాడు అని నమ్మకంతో ప్రజలు గుడికి వెళ్తున్నారు. కేవలం ఆశతో కాదురా, నమ్మకంతో నమ్మకం! ఫెయిత్, నమ్మకంతో ! ఒరే భగవంతుడున్నాడురా. నా కళ్ళతో నేను ఆయన మహిమ చూశాను " గంభీరంగా అన్నారాయన.

తండ్రిని ఆశ్చర్యంతో చూశాడు సత్యం.

"నిజమా నాన్నా, ఏమిటీ మహిమ? ఏదైనా సంఘటన జరిగిందా ?" ఆత్రంగా అడిగాడు సత్యం.

తండ్రికి ముసలితనం వలన మతి చలించలేదు కదా! సందేహం కూడా వచ్చింది అతనికి.

వినాయకరావుగారు కొంతసేపు మౌనంగా వుండి పోయారు.

"నాకు నలభై ఏళ్ళప్పుడు గుంటూరులో ఒక మరపురాని సంఘటన జరిగిందిరా. అప్పట్లో నేనూ, నీలాగే సందేహంతో వుండేవాడిని. భగవంతుడి మీద నమ్మకం నిలవట్లేదు. అలాంటప్పుడు యీ సంఘటన జరిగింది. నేను వివరాలు కనుక్కొని, జరిగిన కథంతా తెలుసుకున్నాక భగవంతుడి మీద సంపూర్ణమైన నమ్మకం కలిగింది. పైపైన చదివిన భగవద్గీత అప్పుడు చాలా వరకు అర్థమైంది" గంభీరంగా అన్నారాయన.

" అసలేం జరిగింది నాన్నా ?" కుతూహలంతో అడిగాడు సత్యం.

అంతవరకూ వాళ్ళ సంభాషణ నిల్చొని వింటున్న సత్యం భార్య, సుశీల తనూ తెలుసుకుందామని, వినడానికి దగ్గరకు వచ్చి ఒక కుర్చీలో కూర్చుంది.

కోడలి వైపు చూసి మందహాసం చేశారు వినాయక రావుగారు. గొంతు సవరించుకున్నారు.

* * * *

పెద్దాపురం చిన్న గ్రామం. ప్రశాంతమైన వాతావరణంతో వుంటుందా గ్రామం ఎప్పుడూ.

అటువంటిది ఆ రోజు ప్రొద్దున్న ఒక పావుగంట దుర్భాషలతో, దౌర్జన్యంతో, చివరికి చావుతో కల్లోలమైంది ఆ గ్రామంలో వాతావరణం.

ఆ వూర్లో రామశాస్త్రి సంస్కృత పండితుడు, పురోహితుడు, బడివంతులు, ముఖ్యంగా రామభక్తుడు.

ఆయన పదహారేళ్ళ కుమార్తె సీతను వీరయ్య కొడుకు సూరయ్య, రేవుకెళ్ళి వస్తూంటే, ఏవో మాటలు సరదాకి అన్నాడు.

తండ్రికి చెప్పింది సీత.

ఆ ముందురోజు రామశాస్త్రి సూరయ్యాని పిలిచి గట్టిగానే మందలించాడు.

వూరంతా గుప్పుమంది.

" సూరయ్య చివాట్లు తిన్నాడుశాస్త్రిగారి దగ్గర. మరి వీరయ్య సహిస్తాడా యిది!"

అందరి నోటా యీ మాటే.

వీరయ్య అప్పుడు వూర్లో లేడు.

గుంటూరు నుండి రాత్రి వచ్చాడు వీరయ్య.

వీరయ్య ఆ వూరి మునసబు కాదు కాదు మహారాజు, కాదు కాదు అదీకాదు వీరయ్య పెద్దాపురానికి నియంతే ;

అతని మాటే వేదవాక్కు. సుగ్రీవాజ్ఞ.

ఆ వూర్లో అతనాడిందే ఆట, పాడిందే పాట.

అందుకు కారణం, అతని చేతిలో అధికారం, అతని సంపద, అన్నిటికన్నా మించినది అతని క్రూరత్వం.

ఎవడెదురు తిరిగినా తొక్కిపెట్టి, చివరికి పాతేస్తాడు.

అటువంటి వీరయ్యకి ప్రొద్దున్న లేవగానే కరణం వామనయ్య కనబడి జరిగింది చెప్పాడు.

వామనయ్య పేరుకు తగినట్లు పొట్టివాడు. జిత్తులమారి నక్క. సరదాగా యిద్దరి మధ్య తగాదాపెట్టి ఆనందించే కలహప్రియుడు. అతను చెప్పిన కథకి, అడిగిన ప్రశ్నలకి వీరయ్యకి వెర్రెక్కింది.

ఒక్క రంకె పెట్టాడు.

కర్రలూ, పలుగులూ పట్టుకుని పదిమంది పరిగెత్తుకొచ్చారు.

సూరయ్య వచ్చి నిలబడ్డాడు.

వీరయ్య కొడుకు చెంప ఛెళ్ళు మనిపించాడు.

"సిగ్గులేదురా సన్నాసీ, పంతులు దగ్గర చివాట్లు తిని ఆడంగిలా వచ్చి పడుకున్నావా ? పదండ్రా, నా కొడుకుని మాటలంటాడా వీడు. పిలక కత్తిరించేస్తాను" గర్జించాడు వీరయ్య.

అందరూ గబగబా అడుగులు వేశారు.

రామశాస్త్రి యింటిముందు చదును చేసిన నేలమీద కూర్చున్న యిరవైమంది పిల్లలకి చదువు చెప్తున్నాడు.

వీరయ్య వచ్చి కాలితో నేలను తన్నాడు.

"ఒరేయ్, యింటికి పోండ్రా" అన్నాడు.

పిల్లలు పరిగెత్తారు.

"ఏమిటీ పని వీరయ్యా ?" అన్నాడు రామశాస్త్రి మెడలో తులసీమాలను సవరించుకుంటూ.

నానా మాటలు అన్నాడు వీరయ్య.

ఘర్షణ పెరిగింది.

రామశాస్త్రి మెడవంచి దభీమని వీపుమీద బాదాడు వీరయ్య.

కళ్ళనీళ్ళు తిరిగాయి రామశాస్త్రికి.

చెంపలు వాయించేశాడు వీరయ్య.

రక్తం వచ్చింది నోట్లోంచి రామశాస్త్రికి.

ఒక్కతాపు తన్నాడు వీరయ్య.

తూలిపడ్డాడు రామశాస్త్రి.

గడపదగ్గరనుండి చూస్తున్న రామశాస్త్రి భార్య వణికిపోయింది. మౌనంగా ఏడుస్తోంది.

లోపలినుండి పరిగెత్తుకు వచ్చింది సీత.

"నాన్నా" అని బాధతో కేకపెట్టి, లేవదీయబోయింది.

"ఓహో, యిదేనా అమ్మాయి" అని మీదకొచ్చాడు వీరయ్య.



భయపడి రెండడుగులు వెనక్కి వేసింది సీత.

"చిలక బాగుందే" అన్నాడు వీరయ్య వెకిలిగా నవ్వుతూ, ఆమె దగ్గరకు వస్తూ.

"వీరయ్యా, ఆగు" అన్నాడు రామశాస్త్రి లేస్తూ.

"ఏం పంతులూ, పడివుండక లేస్తున్నావు" అన్నాడు వీరయ్య.

"వీరయ్యా నన్నేమైనా చెయ్యి. నా పెళ్ళాం పిల్లల్ని వదిలెయ్" అన్నాడు రామశాస్త్రి.

"నీకు బుద్ధి రావాలికదా, ఛ అడ్డులే" అంటూ ఒక్క తాపు తన్నాడు రామశాస్త్రిని వీరయ్య.

అంతదూరం వెళ్ళిపడ్డాడు రామశాస్త్రి.

పరుగెత్తింది సీత.

రెండంగలు వేసి, చెయ్యి పట్టుకున్నాడు వీరయ్య.

" ఛీ, వదులు " గింజుకుంది సీత.

చెయ్యి వదిలి ఆమె బట్టలు చింపబోయాడు

అతని దౌర్జన్యాన్ని చూసి, " యింతవరకూ నిన్ను ఏదీ అడగలేదు ప్రభూ, రామచంద్రా, కాపాడు, నా కూతుర్ని కాపాడు " అన్నాడు రామశాస్త్రి దీనంగా ఆకాశంలోకి చూస్తూ, చేతులెత్తి, కనిపించని దైవానికి నమస్కారం చేస్తూ.

ఒక్కసారి వీరయ్యను విదుల్చుకుని, యింట్లోకి పరిగెత్తింది సీత.

వెనక్కాలే పరిగెత్తాడు వీరయ్య. పరిగెత్తుతున్న వాడల్లా ఒక చావు కేకపెట్టి, గుండెని చేతుల్తో పట్టుకుని, క్రిందపడి విలవిలా తన్నుకోసాగాడు.

" గుండెపోటు, గుండెపోటు, ఆస్పత్రి కెళ్ళాలి " అని మూల్గాడు వీరయ్య.

నోరెళ్ళబెట్టి చూస్తున్న జనం మోసుకెళ్ళారు అతన్ని.

* * *

వినాయకరావుగారు చెబుతున్న కథనాపి కొడుకునీ, కోడల్నీ చూశారు.

" ఒరే, స్పృహ తప్పిన వీరయ్యని గుంటూరుకి తీసుకొచ్చారురా. ఆ రోజుల్లో హాస్పిటల్లో యిప్పుడున్నన్ని మెషిన్స్ లేవులే. ఎక్స్‌రే తీసి, వెంటనే చేయవలిసిందంతా చేశాం.

కానీ ఛచ్చాడతను. శవం యింకా యిచ్చేయలేదు.

కొంతసేపయ్యాక, ఎక్స్‌రే బొమ్మ రాగానే చూసిన డాక్టర్ నా దగ్గర కొచ్చి, 'ఏమిటో వింతగా వుంది' అని చెప్పాడు. నేను వెళ్ళి ఆ ఎక్స్‌రే చూశాను. గుండె ఎవరో కోసినట్లు కనబడింది. శవంమీద గాయం ఏదీ లేదు. నేను సర్జన్‌ని. శవపరీక్ష చేసి చూద్దామనిపించింది. అలాగే చేసి చూశాం.

అది నమ్మలేని ఆశ్చర్యం నాకు !

గుండెలో ఏదో బాణం గుచ్చుకున్నట్లు కోసివేయబడి వుంది. నాకు అనుభవం మీద తేడాలు తెలుసు. కత్తిగాయం ఒకలా, తుపాకిగుండు గాయం ఒకలా, బాణం గాయం ఒకలా వుంటాయి.

యిది బాణంచేత కత్తిరించబడ్డ హార్ట్ !

కానీ విచిత్రం బయట గాయమే లేదు !

కొంతసేపయ్యాక శవాన్ని తిరిగి యిచ్చేశారు ఆస్పత్రి వాళ్ళు.

నేను ఆ మనుషులను అడిగాను. 'ఏమైంది ? ఎందుకిలా తీసుకొచ్చారు ? ఏదైనా కోట్లాట జరిగిందా ? ఎప్పుడొచ్చింది గుండెపోటు' అని. వాళ్ళు సరిగ్గా సమాధానం చెప్పలేదు. ఏదో నసుగుతున్నారు.

యింతలో యింకొందరు పేషెంట్సుని అటెండ్ కావాలని పిలుపు వచ్చింది.

నేను ఆ పనిమీద వెళ్ళాను. ఆరోజు శుక్రవారం.

ఆదివారం నాకు శలవు. యింట్లోవున్న నన్ను చూడటానికి పెద్దాపురం నుండి రంగయ్య అనే రైతు వచ్చాడు. అతను బియ్యం, పప్పులు మన యింటికి సప్లయి చేస్తుంటాడు.

ఆ పనిమీదే వచ్చాడు.

డబ్బు ఇస్తూ నేను అతనిని వీరయ్య గురించి అడిగాను. ఒకే గ్రామం కదా అని.

జరిగిన సంఘటన చెప్పాడతను.

అతను చెప్పిన సంగతి విని ఆశ్చర్యపోయాను నేను !

ఆ రోజు ఎలాగా శలవేకదా అని, ఏమిటో తెలుసుకుందామని, నేను పెద్దాపురం వెళ్లాను.

రంగయ్య నాకు రామశాస్త్రి యిల్లు చూపించాడు.

పాపం, పుణ్యాత్ముడు జ్వరంతో పడుక్కుని వున్నాడు. నాటువైద్యం ఏదో చేయించుకున్నాడు - తగిలిన దెబ్బలు చాలా గట్టి దెబ్బలు. నా బ్రీఫ్‌కేసులోంచి మాత్రలు తీసి యిచ్చి, వెంటనే వేసుకోమని చెప్పి, ఒక యింజక్షన్ కూడా యిచ్చాను.

ఆ పరిస్థితిలో అతన్ని ఏమీ అడగాలనిపించలేదు. కొన్నిరోజులకు సరిపోయే మందులిచ్చి, మళ్ళీవచ్చి

చూస్తానని చెప్పాను. అటునుంచి వీరయ్య యింటి కెళ్లాను. సూరయ్య వున్నాడు. అతనితో మాట్లాడి ఎక్సురే సంగతి చెప్పాను. నా మాటలు విని సూరయ్య గజగజ వణికిపోయాడు. 'అంతా ఆ రాములవారి మహిమే బాబోయ్! మహా పాపం జరిగిపోయింది! ఆ భక్తుడి జోలికి వెళ్ళాం నేనూ, మా నాన్న! పన్నెండో రోజు అవగానే ఆయన కాళ్ళ మీద పడతాను. సార్, మీరు కూడా ప్రక్కనుండండి' అని నన్ను బ్రతిమాలాడు నేను అలాగేనన్నాను.



పన్నెండోరోజు కార్యాలయ్యాక, నేనూ, సూరయ్యా, యింకా పదిమంది కలిసి రామశాస్త్రి యింటికెళ్ళాం. అప్పటికాయన బాగా కోలుకున్నాడు. సూరయ్య నేరుగా వెళ్ళి ఆయన కాళ్ళమీద పడ్డాడు. 'నన్ను క్షమించండి మహాప్రభో!' అంటూ.

రామశాస్త్రి అతన్ని లేవదీసి, భుజం తట్టి, 'ఏమిటిదీ'? అన్నాడు.

అందరూ వింటూండగా, నేనూ సూరయ్యా జరిగినది చెప్పాం.

వీరయ్య మరణం అదృశ్యంగా ఏదో బాణం అతని గుండెలు చీల్చివేయడం వలన జరిగిందని!

'రామచంద్రా, పలికావా తండ్రీ' అన్నాడు రామశాస్త్రి ఆనందంతో వణుకుతూ.

'బాబుగారూ నన్ను క్షమించండి. లేకపోతే ఆ భగవంతుడు నన్ను పురుగును చంపినట్లు చంపేస్తాడు' అన్నాడు సూరయ్య భయంతో.

'భయపడకు నాయనా, నిన్ను ఆనాడు మందలించినప్పుడే క్షమించాను కూడా. యింక నా చేతుల్లో ఏమీ లేదు. నువ్వా రాముడినే ప్రార్థించు' అన్నాడు రామశాస్త్రి.

సూరయ్య తల వూపాడు.

లోపల్నుంచి జానకమ్మ, సీత వచ్చారు.

వాళ్ళు మా మాటలు విన్నట్లు లేదు.

ఒక్క పరుగులో సీత వచ్చింది. 'నాన్నా, మళ్ళీ ఏమిటిది?' అంటూ ఆదుర్దాగా అడిగింది.

'ఏం లేదమ్మా, దుష్ట శిక్షణకీ, శిష్ట రక్షణకీ, మన స్వామి అదృశ్యావతారం దాల్చాడు అంతే' అన్నాడు రామశాస్త్రి గంభీరంగా.

'అమ్మా, నా తప్పు క్షమించు' అంటూ సూరయ్య సీతకి సాష్టాంగనమస్కారం చేశాడు.

'అయ్యో, అన్నా ఏమిటిది? లే, లే,' అంది సీత కంగారుగా.

రామశాస్త్రి అతనిని లేవనెత్తి, రాముడికి పూజ పది రోజులు చెయ్యమని చెప్పాడు.

నా కర్థమైంది!

సూరయ్యకి ముందు భయం పోవడానికి ఆయన అలా చెప్పాడు. పోనుపోను సన్మార్గం ఆయనే చూపుతాడు!

చాలా రోజులు యీ విషయం అందరూ చెప్పుకున్నారు. పేపర్లలోకూడా వచ్చిందీవార్త. ఆధారాలు సరిగ్గా లేవని కొంతమంది నమ్మలేదు. కొందరు నమ్మారు.

"నాలుగు దశాబ్దాలలో ప్రజలీవిషయం మర్చిపోయారు. కానీ, నేను మరువలేనురా. అందుకే నా పనులు నేను

చేసుకుంటూనే, ఆ భగవంతుడిని సేవిస్తున్నాను" అన్నారు వినాయకరావుగారు.

సుశీలా, సత్యం చాలాసేపు మౌనంగా వుండిపోయారు.

బయట వాన ఆగిపోయింది.

వినాయకరావుగారు లేచారు.

సుశీలా, సత్యం మొహమొహాలు చూసుకున్నారు.

ఇద్దరి మనస్సులో భావం వారి కళ్ళలో కనబడింది.

కళ్ళే మాట్లాడుకున్నాయి.

" ఆగండి నాన్నా " అన్నాడు సత్యం.

నడుస్తున్న వినాయకరావుగారు ఆగి ప్రశ్నార్థకంగా చూశారు.

" గుడికి కారులో వెళ్దాం నాన్నా. మేం ఇద్దరం కూడా వస్తాం " గంభీరంగా అన్నాడు సత్యం.

వినాయకరావుగారి కళ్ళు ఆనందంతో మెరిశాయి.

" అలాగేరా " అని నవ్వుతూ సోఫాలో కూర్చున్నారాయన.

తన అనుభవాన్ని నమ్మి కొడుకూ, కోడలూ పరమ పదం వైపు అడుగులు వేస్తున్నారు !

" నా జన్మ సార్థకమైంది ". అనుకున్నారాయన. ★

# శుభాశీషములు

శ్రీవాణీ విలసచ్ఛుభంకర యశస్సంప్రాప్త సంభావితా
శ్రీవాణీ బహుధోక్తికల్ప సుమవస్సమ్మోద సంభాషితా
శ్రీవాణీ రమణీయ వృత్తరచనా వైవిధ్య సంశోభితా
శ్రీవాణీ జయతాత్ శరచ్ఛత మహీన శ్రీ ప్రభాలోకనైః

బహువిధ వాణీ శోభిత, మహనీయ సుధోక్తిసార మహిమాన్వితమై,
ఇహపర సాధకమగుచును, మహినిటు 'శ్రీవాణి' విబుధమాన్వితగాంచెన్.

శ్రీయును వాణియున్ వెలగి చెన్నొనసలారగ మాసపత్రికా
సంయుతమై ధరిత్రినిటు సాంస్కృతికోజ్జ్వల నూత్నదీప్తిశో
భాయుత సుప్రశస్తిగనె వత్సర కాలము కృష్ణమోహనా
శాయుత భవ్యభావనలు సంస్తవనీయములై వెలుంగుతన్.

కొమరగిరి వంశజుండైన కృష్ణమోహ
నుండు 'శ్రీవాణి' వెలయించ నూత్నఫణితి
ఆంధ్ర పాఠకులాదృతి నందఁజేసె
తెలుగు భారతి గళసీమ దీపి వెలిగె.

— మల్లాప్రగడ శ్రీరంగారావు

# మారేడు చెట్టు — ఎస్. ఎన్. దుర్గారావు

(Aegle Narmelas Alarge Spiny Tree)

దీనికి సంస్కృతమున బిల్వ, శ్రీఫల, త్రిపత్ర, గంధపత్ర అని పేర్లు కలవు.

మారేడు చెట్టు ముఖ్యముగా శివాలయంలో కనబడు చుండును. ఈ మారేడు శివునికి అత్యంత ప్రీతిపాత్రమని పురాణాల ఉవాచ. ఈ చెట్టుగాలి సోకిన, పీల్చిన చాలా మంచిది. కావుననే దీనిని ఆలయములలో తప్పక పెంచెదరు. గాలి సోకని గర్భదేవాలయములలో, పూజ చేయబడిన మారేడు పత్రములు దుర్వాసన పుట్టకుండ కాపాడు చుండును.

దీని మ్రాను కొంచెం తెల్లగా నుండును. కొన్ని శాఖలు కూడా కలవు. కాయలు కొన్ని గుండ్రముగా, కోలగా నుండును. చెట్టుకంతయు వాడియైన ముండ్లుండును. పచ్చికాయలు జిగురుగాయుండును. ముదిరి పండిన తదుపరి పై పెంకు గట్టిపడి లోపలి గుంజు వెలగ గుంజువలె నుండును. దీనికి ఒక విధమైన సువాసన కలిగియుండును. ఆకులు త్రిదళ వంటరి చేరిక గలవి. దీని పింజయే పూవు.

ఇది త్రిదోషములను హరించును. ఇవి కారం, చేదు, వగరు రుచులు కలది. వాంతులను కట్టును. బాగుగా పండిన ఫలము తియ్యగా నుండును. వేడిచేయు స్వభావము కలది.

దీని సర్వాంగములు వైద్యమునకు ఉపయుక్తమైనవి. మారేడు ఆకుల రసము వంటికి పూసుకొనిన లేక లోనికి సేవించిన శరీర దుర్గంధము అరికట్టును; ఆకులు దంచగా వచ్చిన రసము కొంచెము వెచ్చజేసి లోనికిచ్చిన త్రిదోషములు, మూలవ్యాధి, మలబద్ధము, కామలా రోగము వీటన్నింటికి పనిచేయును; ఆకులను మెత్తగా చితకగొట్టి కండ్లపై వేసి కట్టిన నేత్ర రోగములు శమించును; మారేడుకాయ ఎండిన ముక్కలు కషాయంగా పెట్టి సేవించిన జ్వరములు తగ్గును; లేత మారేడు కాయలను ముద్దగా నూరి, దీనికి సమభాగము నువ్వులను ముద్దగా నూరి, ఈ రెండింటిని పెరుగులో కలిపి చెమురుతో తాళింపు పెట్టవలెను. దీనిని ఖడమని అందురు. ఇది సేవించిన ప్రవాహికలు అరికట్టును; (చరకం) కాయల కల్కమును, శొంఠి చూర్ణమును బెల్లముతోనూరి సేవించిన ఉగ్రమగు గ్రహణీ రోగము కూడా తగ్గును. వీరు మజ్జిగను మాత్రమే భోజనమున పథ్యముగా వాడవలెను; మారేడుకాయలోని గుంజును, యష్టిమధుకమును మెత్తగా నూరి, పంచదార తేనెతోను చేర్చి కలిపి బియ్యపు కడుగులో




కలిపి త్రాగిన పైత్య అతిసారము కట్టును; మారేడు పిందెలను నూరి బెల్లంతో చేర్చి తినిన ఆమశూలలు, రక్తాతిసారము హరించును; మారేడు పండులోని గుంజు గోమూత్రమున పిసికి, నువ్వులనూనె, మేకపాలు చేర్చి తైలపాకముగా కాచవలెను. దీనిని కొంచెము చెవిలో వేసిన చెముడు తగ్గును; మారేడు కాయలను బియ్యపు కడుగుతో నూరి సేవించిన రక్తమూలములు కట్టును; మారేడు వేరుపై పట్టును తీసి చిదుగగొట్టి కషాయం పెట్టి, పెద్ద పాత్రలో వేసి దానిలో మూలవ్యాధి రోగిని కూర్చుండ బెట్టిన మూలవ్యాధి తప్పక పోవును; దీని వేరు రసము తేనెతో కలిపి సేవించిన త్రిదోషముల వలన కలిగెడి వాంతులను అరికట్టును;

చంటిపిల్లలను సాధారణంగా బాలగ్రహములు వేధించుచుండును. దానివలన కొన్ని రోగములు కనబడుచుండును. ఇటువంటి గ్రహబాధలలో స్కంధ గ్రహ బాధ ఒకటి. దీనికి చికిత్స ఏమంటే మారేడు ముండ్లను పిల్లవాని పేరుగా కట్టి మెడలో వేసిన తప్పక స్కంధగ్రహ బాధనుంచి విముక్తుడగును.

మారేడు వేరు, పసుపు, త్రికటుకములు, పచ్చి తులసి వెన్ను, గ్రంధి తగరము, దేవదారుచెక్క, క్రానుగపప్పు, త్రిఫలములు మ్రాని పసుపు వీనిని సమభాగములుగా గ్రహించి 3 దినములు గోమూత్రమున మర్ధించి, కుంకుడు గింజంత మాత్రలుచేసి తినవలయును, పైకి కూడా రాయవలెను, నస్యముగా కూడా ఉపయోగించవలెను. దీనివలన విషూచీ, పాము, తేలు, వెర్రి కుక్కకాటు విషము మొదలైనవి హరించును. ఈ మాత్రలనే బిల్వాది మాత్రలు అని పిలిచెదరు. ( మళయాళ రహస్యయోగం నుంచి).

ఈ మారేడు చెట్టు వలన ఇంకను అనేక వైద్య ఉపయోగములున్నవి. మారేడు, మరికొన్ని ఔషదములు కలిపి లేహ్యములు కూడా తయారుచేసెదరు.



## భారీ పరిశ్రమలు

విద్యకు పరమార్థం
విజ్ఞానమా ? కాదు !
ఆత్మవిశ్వాసమా ?
అసలే కాదు
మరేమిటి ?
ఉద్యోగం !
విద్దెకు కొలబద్ద
అరంగుళాల సర్టిఫికెట్
కాగితాలమ్మే కార్ఖానా దగ్గర
రెండు పాదాల గాడిదలు
క్యూలో నిలబడతాయి
ఆ పైన వచ్చిన ఉద్యోగంతో
కడుపు నిండడం లేదని
అడ్డమైన గడ్డీ మేస్తున్నాయి
దినదినానికి గడ్డివిలువ పెరుగుతోంది.

- ఆశావాది ప్రకాశరావు

# సూర్య భగవానుడు

" ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్ " అని ఆర్యోక్తి. నవగ్రహాల్లో సూర్యుడిది అగ్రస్థానం. సూర్యుడు బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుడని, ఆయనని ప్రార్థిస్తే రోగాలు తొలిగి ఆరోగ్యం చక్కబడుతుందని పురాణ వాక్యం. అరసవెల్లి-కోనార్క సూర్య దేవాలయాలు చరిత్ర ప్రసిద్ధి.

సకల జీవులకు ఆధారభూతుడు సూర్యుడు. సూర్యుడే జగత్తుకు ప్రాణాధారుడు - ప్రత్యక్షదైవం అని సూర్యోపాసన, సూర్య నమస్కారాలు చేస్తూ అగ్రహారాజు ప్రీతి కోసం గోధుమలు దానం చేస్తుంటారు. ఇదంతా మన సాంప్రదాయ విశిష్టత. మనకేగాదు ఏ దేశస్తులకైనా సూర్యుడు ప్రథమ తాంబూలాలు అందుకునే మహానుభావుడే. ఆయనకి పౌరాణిక ప్రసిద్ధి ఎంత వుందో వైజానిక రంగాన కూడా అంత వుంది. యురోపియన్ల సూర్యరశ్మి స్నానాలు అందరికీ తెలిసిందే.

సూర్యమండలం మహా శక్తివంతమైంది. అందులో ఏది విరామాలు లేకుండా ఉష్ణ ప్రసారం జరుగుతూ వుంటుంది. ఆ ఉష్ణ ప్రసారంలో కేవలం ఆరు శాతం తగ్గిపోతే చాలు భూమండలం అంతా మంచు ముద్దగా మారిపోతుందంటే-మిక్కిలి విచిత్రంగా కనిపించవచ్చు. అంటే సూర్యమండలంలో జరిగే మార్పునుబట్టి భూమి వాతావరణం మారిపోతూ వుంటుందన్నమాట. అందుకే అతివృష్టి-అనావృష్టి ఏర్పడుతూ వుంటాయి మనకి.

సూర్యుడు ఉదయం 10 గంటలకు, మధ్యాహ్నం 3 గంటలకు మధ్య మరీ శక్తివంతంగా వుంటాడు. సూర్యరశ్మి వృధా పోకుండా మానవాళికి ఉపయోగపడాలని ఎన్నెన్నో పరిశోధనలు చేస్తున్నారు. ఆ విధంగా పరిశోధనల ప్రభావమే ఇప్పుడు సౌర శక్తితో వంట చేసుకునే సోలార్ కుక్కర్ల వాడకం. పెట్రోలు అవసరం లేకుండా సౌరశక్తితో మోటారుకార్లని నడపడం, ఇండియాలాంటి దేశంలో వాణిజ్య సరళిలో విద్యుచ్ఛక్తిని కూడ పెట్టడానికి చేసే ప్రయత్నాలు దాని వాడకానికి గల డిమాండ్‌తో ఎంతమాత్రం సరితూగలేవు. ఇతర మార్గాలలో కూడా విద్యుత్తును సేకరించాలి. గ్రామీణ ప్రాంతంలో వాడకానికి 45% సౌరశక్తి తోడ్పడుతుంది.

సౌరశక్తితో పనిచేసే పంపును ప్రప్రథమంగా ఇండియాయే తయారుచేసింది. అయితే తక్కువధరకు గిట్టుబాటయ్యేట్టు వ్యాపార సరళిలో తయారుచేయడమే సమస్య.

## జొన్నలగడ్డ లలితాదేవి

వర్షాభావం మరీ తీవ్రంగా వున్నప్పుడు సోలార్ జనరేటర్లు నీటిని పంపులద్వారా సమకూరుస్తాయి. పంటలు పాడైపోకుండా సౌరశక్తి సాధనాలవల్ల వాటిని నిలవ చేయవచ్చు. అడవుల్లో కలప చిక్కు తొలగించవచ్చు. తమిళనాడులో వ్యవసాయాభివృద్ధికి మద్రాసులో ఏర్పడిన సౌరశక్తి కేంద్రం విశేషంగా కృషి చేస్తోంది. ఇప్పుడిప్పుడే బయోగ్యాస్ ఎడ్వర్టయిజ్‌మెంట్లు ఆకర్షిస్తున్నాయి. బయోగ్యాస్‌తోపాటు చిన్న సోలార్ పాసిల్ జనరేటర్లు గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి నందించబోవడం విశేషం.

ఈ సంవత్సరంలో వాడకానికేమి, ( ఇళ్ళల్లో ) రేడియోలు నడుపుకోవడానికేమి అనేక కుటుంబాలు విద్యుచ్ఛక్తిని స్వంతంగా సమకూర్చుకోవచ్చునన్న సెంట్రల్ ఎలక్ట్రానిక్స్ లిమిటెడ్‌వారి వాక్కు ఎంతవరకూ ఫలిస్తుందో-ఎంతవరకూ ప్రచారంలోకి వస్తుందో-ఎన్ని కుటుంబాలవారికి ఈ సౌరశక్తి ఉపయోగం అర్థం అయిందో నెమ్మదిమీదగాని తెలియదు. 

# తల్లి బాధ్యత

శ్రీమతి పింగళి సీత

బాధ్యత ఎంతవరకూ ? ఎదిగివచ్చే ఆడపిల్ల విషయంలో.

ఆడపిల్ల ఎదిగితే అమ్మకు ఆసరా అంటారు. ఎదిగి వచ్చే ఆడపిల్ల ఇంట్లో పనులు చేస్తుంటే ఇంటికే అందం.

నేడు చాలామంది ఆడపిల్లలు చదువుకుంటూ ఇంటి పనులమీద ధ్యాస పెట్టటంలేదు. అమ్మ పిలిచినా వినిపించుకోరు. చదువు పూర్తవగానే వివాహాలు అయిన వారు అత్తింట అడుగు పెడతారు. ఇంక అక్కడ చూడాలి కథాకళి.

ఈ ఆడపిల్ల ధోరణి షోగ్గా ముస్తాబయి ఏదో కథలు, పుస్తకాలు పుచ్చుకుని హాల్లో బయిఠాయించే ఆ తీరుని చూసి, ఆ అత్తగారు ముక్కుమీద వేలు వేసుకుంటే ఆవిడని గయ్యాళికింద కట్టేస్తారు.

' కోడలు వస్తుంది, ఇంటిని దిద్దుకుంటుంది ' అని ఆశించిన అత్తగారి హృదయం రోదించాల్సిందే. ' ఇది చెయ్యమ్మా ' అని పిలిచి పని చెపితే ఆమె అరడి పెట్టినట్లు చిలువలు పలువలు చెప్తారు.

అమ్మ నేర్పని పనులు అత్తన్నా నేర్పాల్సిన అవసరం వుంటుంది గదా. కొందరు తెలివైన ఆడపిల్లలు పుట్టింట్లో పని చెయ్యకపోయినా విజ్ఞతతో అత్తింట అడుగు పెట్టగానే ఎంతో నేర్పు వున్నట్లు అన్నీ సమర్థించుకు పోతారు.

కొందరు అత్తగారి ఆధ్వర్యంలో నేర్చుకోగలుగుతారు. ఎటూ చెందని వారివల్లె వచ్చే యిబ్బంది అంతాను. ఇంక వేరింటి కాపురం అయితే కట్టుకున్న భర్త పడాలి అవస్థ ఏ పని చాతకాని భార్యని కట్టుకున్నందుకు.

పెళ్ళిచూపుల్లో వంటా వార్పూ వచ్చా అని పూర్వం పెద్దవాళ్ళు అందుకనే అడిగేవారు ఇప్పుడు సంస్కారానికి అవన్నీ అనవసరపు ప్రశ్నలు కింద వస్తాయి. కానీ వివాహానంతరం ఇంటిని దిద్దే బాధ్యత ఎంత చదువుకున్నా, చదువుకోకపోయినా, ఉద్యోగిని అయినా, కాకున్నా మన సాంప్రదాయ ప్రకారం ఇల్లాలిదే.

బ్రహ్మచారిగా వున్నన్నాళ్ళు ఏదో రూముల్లో కాలక్షేపం చేసి మగవారు సంసారం ఏర్పడ్డాక గృహ తాపత్రయాలు పెంచుకుంటారు. భార్యకి భర్తే కాఫీ చేసి, వంట చాతకాని పిల్లని కట్టుకుని, తనే వంటచేసి ఆఫీసుకు వెళ్తాడా ? రోజూ హోటల్‌కి వెళ్తాడా ?.

ఈ రోజుల్లో చాలా యిళ్ళల్లో చూస్తూనే వున్నాం. "మా అమ్మాయి M. B. A. చదివింది" "మా అమ్మాయి M. B. B. S. చదివింది" అంటారు. ఈ చదువులతో పాటు ఇంటిపని కూడా సమర్థవంతంగా నిర్వహించినపుడే ఆ స్త్రీకి విలువ. చదువుకునే వయస్సులోనే తల్లి కూతురికి పని పాటలు సర్దాగా చేయటం అలవాటు చెయ్యాలి. వంట పని కూడా నేర్పుగా అలవాటు చెయ్యాలి. అదేదో పెద్ద పని అనే భావన రాకుండా చెప్పాలి. నిజానికి ఇంటిపని, వంటపని ఒక కళే. ఎన్ని ఇతర కళలున్నా ఆడపిల్లకి అందాన్ని, ఆనందాన్ని కలిగించేవి యివే.

సుష్ఠుగా వండి అతిథులని మెప్పించవచ్చు. ఎంత కర్కోటకం భర్త అయినా సుఖమైన భోజనం రుచిచూస్తే కాసేపయినా సౌమ్యంగా వుండచ్చు.

ఎంత సౌమ్యుడయిన పురుషుడయినా ఇల్లాలిచేతి వంట కంటకప్రాయంగా వుంటే రెచ్చిపోకమానడు.

గృహిణి స్థానాన్ని పొందిన ఏ స్త్రీ అయినా భర్తని, పిల్లలని, ఇంటిని ఎంతో శ్రద్ధగా చూసుకోవాలి.

' ఆ, వెధవ టిఫిన్ ఎవరు చేస్తాడు ? వంట వండాలంటేనే చికాకు ', అనే ఆడపిల్లలున్నారు. వారలా వుండటానికి కారణం ఎవరు ? తల్లి పెంపకమే.

వయస్సు వచ్చిన ఆడపిల్లకి తల్లి శిక్షణ చాలా అవుసరం. "చెపితే వినరు" వాళ్ళిష్టం అనే తల్లులుంటారు. ఆడపిల్లలు వేష భాషలు కూడా వెఱ్ఱితలలు వెయ్యకుండా చూడవలసిన బాధ్యత తల్లిదే.

రోజూ పనిమనుషుల్లా ఇంట్లో పని చెయ్యవలసిన అవసరంలేదు. అవుసరమయితే అన్ని పనులు చేసుకోగల నేర్పు అలవాటు చెయ్యాలి.

"బియ్యం కడిగి పెట్టాలా? నాకు తెలీనే తెలీదు, గ్లాసు బియ్యం, రెండు గ్లాసులు నీళ్ళు పోసేసి పెట్టాను." అని నా పెళ్ళయిన కొత్తలో నా లు చెప్పింది.

ఆవాలు నిండా రాళ్ళే. ఒకామెకి ఎలా బాగుచెయ్యాలో తెలీలేదు. నీళ్ళల్లో గాలిస్తే పోతాయంటారు రాళ్ళు, యిసుక. ఎలాగో తెలీక ప్రక్క వాటాలో ఆమెని చూపించమని అడిగిందట కొత్తగా కాపురం పెట్టిన ఆమె.

"ఆవాలు కడుక్కోవటమా? ఏమో నే నెప్పుడూ చెయ్యలేదు. ఎలా కొన్నవి అలా వాడతాను" అని చెప్పిందా ఇల్లాలు.

(ఇప్పుడంటే బాగుచేసిన సరుకు దొరుకుతోందనుకోండి)

ఎలాగో అవస్థపడి కడిగిన ఆమె గిన్నె అడుక్కి దిగిన గుప్పెడు కంకటి యిసుకని చూసి ప్రక్కామె చెప్పిన సమాధానానికి ఆశ్చర్యపోయింది.

తనూ శ్రద్ధపట్టి చేసేవి కాదేమో కాని, రోజూ భోజనంలో వళ్ళు, నోఱు పట్టుకుని రాళ్ళు వచ్చాయని, తినలేని భర్తని చూసి తన చాతకానితనానికి చింతించింది.

ఇలాంటివన్ని చెప్పుకుంటే చిన్న విషయాలే, కాని నిత్యకృత్యాల్లో అవే ముఖ్యమయినవి.

తల్లి నేర్పుగా, సందర్భానుసారంగా ఎదుగుతున్న ఆడపిల్లకి పనులు తెలియ చెప్పాలి.

విడిచిన బట్టలు బాత్‌రూంలో వంకీకి వదిలేసే అలవాటు పుట్టింట్లో వున్నపుడు సాగితే, రేపు పెళ్ళయ్యాక ఆ అలవాటు తప్పేది ఎలా? భర్త తియ్యాలా, లేవలేని అత్తగారు తియ్యాలా? ఇలా ఎన్నో విషయాలు ఆడపిల్లలు అలవర్చుకోవలసినవి వుంటాయి.

## నిమిత్తమాత్రుండనైనా ...

వాకిలి తెరిచాను
వెలుతురు కిరణాలు దూసుకొస్తాయని
చేతులు చాచాను
ఆనంద ఆకాశపుటంచులు అందుకోవాలని—
చీకటి వేళ
చిరుదీపం నీపై వచ్చినా చాలనీ—
అల్పిప్పల ఈ కళ్ళల్లోని నీటిబిందువులు
సముద్రతీరపు ఇసుకలో పడితే వ్యర్థం కదా!
అవి నీ పాదారవిందాల మీద కురిస్తే మేలని
తుఫాను గాలిలో నిలబడి
ఎంత సేపుండగలుగుతాను?
నిమిత్తమాత్రుడినైనా
నీవిచ్చిన ఈ జీవితానికొక సార్థకత
ఉండాలి కదా!
అదే నా వ్యథ!

— ఉమ్మెత్తల

చదువుకుంటున్న పిల్లలని, ఆ వంకన ఇంటికి పట్టకండా ఆడపిల్లల్ని స్టయిలుగా పెంచకూడదు. మన సాంప్రదాయాలు, పద్ధతులు, మాట, మంచి, మన్నన అన్ని అమ్మ కూడా తిరిగే ఆడపిల్లకి స్నేహంగానే అన్నీ అలవాటు చేయొచ్చు. వాళ్ళే నేర్చుకుంటారని నిర్లక్ష్యం చెయ్యకూడదు. తల్లి బాధ్యత ఎంతైనా వుంది.

తల్లి అసమర్థురాలైనపుడు ఆడపిల్లలే తమంత తాము ఎదుటి ఇల్లాళ్ళను చూసైనా నేర్చుకోవలసిన అవుసరం వుంది.

అపుడు భవిష్యత్తులో తన పిల్లలకి తల్లిగా తన బాధ్యత సక్రమంగా నెరవేర్చగలదు. ★

# శశికళా ప్రియంభావుకుడు

**కులపతి** శ్రీ అడివి బాపిరాజుగారు గురువైన కూల్డ్రే మహాశయునితో కలసి ప్రకృతి సౌందర్య దర్శనార్థం పర్యటిస్తుండగా ఒకనాటి రాత్రి బాపిరాజుగారు ఒక బండపై విశ్రమించారట. గురువైన కూల్డ్రే సమీపంలో కూర్చున్నారు. పూలచెట్లతో, లతలతో ఆ ప్రాంతం వీరికి మనోహరంగా ఉంది. అది వెన్నెలరాత్రి కావడంచేత ఆ ప్రాంతమంతా వెలుగులతో నిండిపోయింది. చంద్రుడు చల్లని వెన్నెలలతో గురుశిష్యులకు ఉల్లాసాన్ని చేకూరుస్తున్నాడు.

## డాక్టర్ మన్నవ సత్యనారాయణ

**ఇంతలో** ఓ సంఘటన జరిగింది. వెన్నెల వెలుగుతో ఏదో అనిర్వచనీయమైన దివ్యకాంతి బాపిరాజుగారి దేహంపై పడి తక్షణమే వారిలో అంతర్లీనమైనట్లు తోచింది. అపుడు కూల్డ్రే పొందిన ఆనందానికి, ఆశ్చర్యానికి అంతులేదు. మూడువేల సంవత్సరాల క్రిందటి ఎండీమియాన్ కథ స్ఫురణకురాగా, కూల్డ్రే మహాశయుడు అతడే ఈ బాపిరాజని భావించి అప్పటినుండి బాపిరాజుగారిని "ఎండీమియాన్" అని పిలవసాగారు. గ్రీకు దేశీయుడైన ఎండీమియాన్ గోవును మేపుకుంటూ జీవించేవాడు. ఒకనాటి రాత్రి పొలాలలో నిద్రిస్తున్న ఎండీమియాన్‌ను వెన్నెల రూపంలో వచ్చి ఒక స్త్రీ అతనిని కౌగిలించుకొని అతనిలో కలసిపోయిందట. ఎండీమియాన్ అప్రతిమాన సౌందర్యవంతుడు కావడంచేత ఒక దివ్యాంగన ఇలా అతనిలో లీనమైపోయింది. కాల్పనిక కవులైన కీట్సు ప్రభృతులకు ఈ కథ కవితావస్తువైంది. ఈ కథంతా చెప్పి కూల్డ్రే "నీకూ అనాటి ఎండీమియాన్‌కి ఎలాంటి భేదం కన్పించడంలేదు. అనాటి ఎండీమియాన్ నీవేనని నాకనిపిస్తుంది". అని నవ్వుతూ శిష్యుని వీపు తట్టారట.

స్వదేశానికి తిరిగివెళ్ళిన తరువాత కూల్డ్రే మహాశయుడు "ఎండీమియాన్" అనే శీర్షికతో ఆనాడు విశ్రమించిన బాపిరాజుగారి చిత్రాన్ని వేసి శిష్యునికి పంపారు. ఈ చిత్రాన్ని శశికళ గేయసంపుటిలో చూడవచ్చు.

"నిదురపోయే నన్ను చూచీ
నాపై వాలిన నిన్ను చూచీ
గురువు కూల్డ్రే చిత్రం లిఖియించె
ఓనా బ్రతుకు తెరువుల ప్రవిమలాంగీ
"ఎండిమియానని" చిత్రం పేరుంచె!

చిత్రం చూచిన పెద్దలంతా
చిత్రమెంతో గొప్పదనిరీ
చిత్రం వ్రాసిన చిత్రకారుడు
ఎండీమియాన్ని చూచేనన్నారే
ఓనా నిత్య ప్రణయినీ
చూచిన సత్యం నీకే తెలుసునే!"

బాపిరాజుగారి జీవితంలో జరిగిన ఈ సంఘటన నిజమేనా? ఇలా జరుగడం అనేది ఎంతవరకు సాధ్యం? అని ఎవరికైనా అనిపించవచ్చు. అంత మాత్రంచేత ఇదంతా కేవలం కల్పన మాత్రమే అని అనుకోవటం ఎంతమాత్రమూ సరికాదు. కళాహృదయుడైన కూల్డ్రే శిష్యుడిని ఆ స్థితిలో చూచినపుడు అలా భావించడంలో అతిశయోక్తి లేదు. ఈ సంఘటనతోపాటు అప్పటి కూల్డ్రే మహాశయుని మనోభావాల్ని కూడ కూల్డ్రే గీసిన చిత్రం చక్కగా ప్రతిబింబిస్తుంది. ఏది ఏమైనా బాపిరాజుగారు గురువుచే ఎండీమియాన్‌గా భావింపబడి సమాదరింపబడటం, భావకవులలో బాపిరాజుగారు శశికళప్రియంభావకునిగా ప్రఖ్యాతినందటం అక్షరాలా యదార్థం. నాటినుండి తనలో లీనమైన ఆ సౌందర్యరాశికి "శశికళ" అని నామకరణం చేసి ఆమెకై నిరంతరం అన్వేషణ సాగించి ఆమెపై ఎన్నో గేయాలు రచించారు శ్రీ బాపిరాజుగారు.

బాపిరాజుగారికి భావకవులలో స్థానం లభించిపెట్టింది వారి "శశికళ". ఎవరీ శశికళ ? బాపిరాజుగారికి ఈమెకు ఏమి సంబంధము ? అన్న ప్రశ్నలకు అనేకులు అనేక విధాల సమాధానాలు చెప్పారు. ఈ విషయమై కొందరు ఏవేవో ఊహలు చేశారు. శశికళ బాపిరాజుగారి ఊహా ప్రేయసి అని కొందరంటే, బాపిరాజుగారికి ఆమె ఆరాధ్య దేవత అని మరికొందరన్నారు. ఇది ఇలా ఉండగా బాపిరాజుగారు ఒక సౌందర్యవతిని ప్రేమించి విఫలుడై ఆమెకై జీవితాంతం తపిస్తూ ఆమెకు "శశికళ" అను పేరుపెట్టి తమ ఆవేదననీ, అనుభూతినీ గేయాల రూపంలో వ్యక్తం చేశారని మరికొందరు విపరీతంగా వ్యాఖ్యానించారు. ఇంతమంది ఇన్ని విధాల భావించడానికి బాపిరాజుగారు తమ గేయాలద్వారా వ్యక్తం చేసిన భావాలే కారణం "శశికళ"ను బాపిరాజుగారు ఏ ఒక్క కోణం నుంచోగాక అన్ని కోణాల నుంచి అవాహన చేశారు. ఆమెకై పరితపించారు. వీరికి శశికళ వలపు హొయలతో లాలించే ప్రేయసి, వాత్సల్యం కురిపించే మాతృమూర్తి. గురువు, శిష్యురాలూ, వాణి, రాజ్ఞి, బాణి, సూర్యసుత, సోమసుత, ఉపాసనా దేవత, గానశిల్ప చిత్రాది కళామూర్తిని. ఇంత విస్తృత మైంది వీరిరువురి సంబంధం. ఇది అనూహ్యము.

బాపిరాజుగారు శశికళకై అనుక్షణం అన్వేషించారు. విప్రలంభ శృంగారంతోనే జీవితమంతా గడిపారు. ఆమె ఎడబాటును భరించలేక నిరాశతో నిట్టూర్చారు.

" నీకై నే ఎదురుచూస్తి
నీకై నే వెదకినాను
కనుతెరచిన కలలమధ్య
కలలెరుగని గాఢనిద్ర
నీకై నే ఎదురుచూస్తి
నీకై నే వెదకినాను "

అంటూ నిరీక్షించారు. బాపిరాజుగారి జీవితమంతా శశికళాన్వేషణతోనే గడిచిపోయింది. కడకు జీవితం చాలించి ఆమెలో లీనమై అద్వైతసిద్ధి పొందారు.

బాపిరాజుగారి శశికళా గేయాలు ఆకాశవాణి తరచు ప్రసారం చేస్తున్నది. "పాడకే నా రాణీ," "పాడెదను నీకునై పాటలను దేవి" అనే గేయాలు సుప్రసిద్ధ గాయకులు శ్రీ ఘంటసాల వేంకటేశ్వరరావు పాడగా రికార్డు చేయబడ్డాయి. బాపిరాజుగారు జీవించి ఉండగానే వీరి గేయాలకు సాహితీప్రియుల అభిమానం లభించింది. బాపిరాజుగారు చివరి రోజుల్లో గేయాలన్నిటిని సరిచూచుకొని గేయ సంపుటి వ్రాతప్రతిని సిద్ధం చేశారు. అది ముద్రితంకాక మునుపే మృత్యువాత పడ్డారు. వారి మరణానంతరం 1954 జనవరిలో శ్రీ రావులపర్తి భద్రిరాజుగారి పూనికతో తొలిసారిగా ఆ గేయసంపుటి ప్రచురింపబడింది. బాపిరాజుగారు 'శశికళ' ను ప్రేమించి, ఆరాధించి, ఆమెకోసం పరితపించి, ఆమె సాక్షాత్కారానికి అనుక్షణం నిరీక్షించి ఆమెపై ఎన్నో గేయాలు వ్రాసి శశికళాప్రియం భావుక భావకవిగా సంభావితులైనారు.

శశికళాప్రియంభావుకుని గేయరచనా వ్యాసంగం కేవలం ప్రణయ గీతాలకు మాత్రమే పరిమితం కాలేదు. బాపిరాజుగారు పాఠశాలా విద్యార్థిగా ఉన్న రోజులలో వీరి పినతండ్రి కుమారునితో కలసి చేలవెంట, చెట్లవెంట, తోటలవెంట, తోపులవెంట తిరుగుతూ జానపదుల జీవన విధానాన్ని బాగా పరిశీలించేవారు. జానపద జీవితం వీరిని బాగా ఆకర్షించింది. పల్లె జీవనాన్ని ప్రతిబింబించే గేయాలు అనేకం వ్రాశారు. కొంతకాలానికి అవి "తొలకరి" అనే సంపుటిగా ప్రచురింపబడ్డాయి. ఇదే వారి మొదటి గ్రంథం. అయితే ఈ గ్రంథం ద్వారా వీరు పాఠకుల్ని అంతగా రంజింపజేయలేకపోయారు. బాపిరాజుగారి మనస్సు పరిపక్వం కాక పోవడం, ఛందోవిషయ పరిజ్ఞానం అంతగా లేకపోవడం ఇందుకు ప్రధానకారణాలు. బాపిరాజుగారు స్వీకరించిన ఇతివృత్తం జనపద సంబంధమైనది. గేయాలు కావ్యభాషలో ఉన్నాయి. అందుచేత పాఠకులకు భాషలో కృతకత్వం గోచరిస్తుంది. ఈ గ్రంథానికి రావలసినంత ఖ్యాతి రాకపోవడానికి ఇదొక్క కారణం. వీరు తరువాత "గోధూళి" అనే గేయ

సంపుటిని పాఠకుల కందించారు. దీనిలో పై లోపాలేవీ కనిపించవు. ఈ గ్రంథంలోని గేయాల ద్వారా జానపదుల జీవిత విధానాన్ని రమ్యంగా చిత్రీకరించారు. ఈ సంపుటిలోని " ఆకుమళ్ళు " " పంటపదం ", "పోలి", " సోదె ", " తోటమాలి కూతురు ", " గొళ్ళ సెల్లాయి కూతురు ", " కోయపడుచు " ఇత్యాది గేయాలు బాపిరాజు గారిని ఉత్తమ జానపద కవిగా సాహితీలోకానికి పరిచయం చేసి ఉత్తరోత్తరా వీరికి మంచి కీర్తి నార్జించి పెట్టినాయి. బాపిరాజుగారి గేయాలు అనతికాలంలోనే గ్రామగ్రామాల వ్యాపించి జనపదుల నాలుకలపై నాట్యం చేశాయి. రైతులు, కార్మికులు, యువతీయువకులు, బాలబాలికలు ఒక్క మాటలో చెప్పాలంటే ఆబాలగోపాలం ఆనాడు వీరి గీతాలు ఆనందంతో పాడుకునేవారట.

1921 ప్రాంతంలో దేశరాజకీయాలు బాపిరాజుగారిని కదిలించి వేశాయి. జాతీయోద్యమంచేత ప్రభావితులై ఎన్నో దేశభక్తి గీతాలు వ్రాశారు. అంతేకాక గాంధీజీపై కూడ అభిమానంతో గేయాలు వ్రాసి వివిధ సభలలో ఆ గేయాలు పాడుతూ మహాత్ముడిపై తమకుగల మక్కువను వ్యక్తీకరించారు. " హిమాలయోత్తుంగ శిఖరం! నీ బ్రతుకు ఉమాపతీ నృత్యరంగం " అన్న గేయం ఆనాడు గొప్ప సంచలనాన్ని కలిగించిందట. బాపిరాజుగారు స్వాతంత్ర్యాన్ని అభిలషించి గేయాలు వ్రాసినట్లే, స్వరాష్ట్రాన్ని ఆశించికూడ గేయాలు వ్రాశారు. ఆంధ్ర రాష్ట్రావతరణకు రెండు దశాబ్దాలకు పూర్వమే అంటే 18-3-1935 న తెలుగువారి సమైక్యాన్ని గురించి ఊహిస్తూ "విజయఢంకా" అన్న గేయాన్ని కూర్చారు. బాపిరాజుగారి భవిష్యద్దర్శనానికి, భావనాబలానికి ఈ గేయం చక్కని ఉదాహరణ. ఈ విధంగా జాతీయోద్యమ ప్రేరణతో బాపిరాజుగారు ఎన్నో గేయాలు వ్రాశారు.

పైన పేర్కొనబడినవేకాక వెలుగు చూడవలసిన గేయాలు ఎన్నో ఉన్నాయి. ఆ గేయాలన్ని ప్రచురింపబడితే గేయకారునిగా బాపిరాజుగారి స్థానమేమిటో లోకానికి పూర్తిగా విదితమౌతుంది.



## ప్రశ్నలు-సమాధానాలు

1. అతి పురాతన బ్యాంక్ ఏది? దానిని ఎప్పుడు స్థాపించిరి?
2. మనదేశంలో వైమానిక రవాణాను జాతీయం చేసిన సంవత్సరమేది?
3. ఒక పురుషుడు ఒక స్త్రీతో కలిసి పేవ్‌మెంట్ పై నడుస్తున్నప్పుడు ఎటువైపు నడవాలి?
4. ' గోల్డ్ ఆఫ్ ది హిల్స్ ' అని పిలువబడే పండు ఏది?
5. మొట్టమొదటి క్రికెట్ టెస్ట్ పోటీ ఎప్పుడు, ఎక్కడ జరిగింది?
6. ప్రపంచంలోని మొత్తం దేశాలెన్ని?
7. మొదటి పగడపు పురుగుల ద్వీపము ఏది?
8. భారతీయ జానాభాలో హిందువుల శాతమెంత?
9. ' జలియన్‌వాలాబాగ్ ' దురంతం జరిగిన పట్టణమేది?
10. కలర్ టి. వి. లోని ప్రధాన వర్ణములేవి?



1. స్వీడన్‌లోని 'రిక్స్‌బ్యాంక్', 1656లో స్థాపించినారు. 2. 1956లో, 3. పేవ్‌మెంట్‌కి బైట వైపు, 4. ఆపిల్ పండు, 5. 1877లో ఆస్ట్రేలియాలోని మెల్‌బోర్న్‌లో, 6. 179, 7. లక్షద్వీప్, 8. 84, 9. అమృతసర్, 10. గ్రీన్-బ్లూ-రెడ్.

జరిగిన మోసం గ్రహించాడతను.

"మర్యాదగా లొంగిపో!" ఓ పోలీసాఫీసర్ అరిచాడు. తలెత్తి ఓసారి అందర్నీ చూశాడు రాఘవ. తనవాళ్ళంతా కూడా అక్కడే వున్నారు!

అతని మెదడులో ఎన్నో భావాలు!

"ఆ రివాల్వర్ క్రింద పడెయ్!" మళ్ళీ అరిచాడా ఆఫీసర్. మెల్లగా రివాల్వర్ కింద పడెయ్యడానికి ఒంగాడు.

అయితే అతను రివాల్వర్ కింద పడెయ్యలేదు. తెలివిగా చందనని అంటిపెట్టుకుని భయంతో ఒణికిపోతున్న బాబుని లాగి తనకడ్డుపెట్టుకుని .... "ఇప్పుడు రండి! నా దగ్గరికి పిట్టల్ని కాల్చినట్టు కాల్చి పారేస్తాను!" అన్నిటికీ తెగించిన రాఘవ వికటంగా నవ్వాడు.

జరిగిన కథ

'నువ్వా?' అన్నాడు జయంత్ సారధిని చూస్తూనే. "నా సంగతి తరువాత ముందు బాబుని, చందనని రక్షించుకోండి. పోలీసుల సహాయం కూడా తీసుకోండి" అని అడ్రసిచ్చి హడావిడిగా వెళ్ళాడు సారధి పురోహితుడితో సహా! రాఘవ జరిగిన అలజడి మర్చిపోవటానికి అన్నట్లు తాగుతున్నాడు. సారధి తెలివిగా పని వాళ్ళందర్నీ ఒక గదిలోకి పంపి గొళ్ళెం పెట్టాడు. రాఘవ గొడవ ఏమిటంటె సర్ది చెప్పాడు. సారధి అటు వెళ్ళగానే గొళ్ళెం తీసిన రాఘవకి జరిగిన మోసం అర్థమయింది. రివాల్వర్ తీసుకుని హాల్లోకి వచ్చిన రాఘవకి అక్కడున్న పోలీసుల్ని చూడగానే స్టన్నయి పోయాడు.

ఇక చదవండి




అనుకోని ఈ సంఘటనకి పోలీసులతో సహా అందరూ నిశ్చేష్టులయి పోయారు.

"చందనా! .... ఇలా నా దగ్గరకి రా!" సౌమ్యంగానే అన్నాడు రాఘవ.

"రాఘవా! ఏమిట్రా ఈ పని" భయంగానూ కోపంగానూ అంది దేవకి.

"అదంతే అక్కయ్యా! నాకు చందన కావాలి! .... ఇంత నమ్మకద్రోహం చేసిన సారథి ప్రాణాలు కావాలి! నేను అన్నింటికీ తెగించినవాణ్ణి. ఒక్క చందన మీద తప్ప నా కెవరి మీదా మమకారాల్లాంటివి లేవు! మీరంతా అడ్డు తొలగండి! నేను చందనని తీసుకుని ఎక్కడికైనా వెళ్ళిపోతాను! నాకు మీ ఆస్తిపాస్తులేం అక్కర్లేదు!" ఆదోలా ఒణికిందతని గొంతు.

బాబు భయంతో ఒణికిపోతున్నాడు.

"వస్తావా వీణ్ణి కాల్చి పారెయ్యమంటావా?" కర్కశంగా అన్నాడు రాఘవ.

"నేనొస్తే వాణ్ణొదిలేస్తావా?" అంది చందన.

"ఆ! తప్పకుండా వదిలేస్తాను! కానీ ఇప్పుడు కాదు!" ....

"మరెప్పుడు?"

"మనం ఎక్కడికైనా వెళ్ళిపోదాం! పెళ్ళి చేసుకుందాం! ఆ తరవాత వాణ్ణి క్షేమంగా వాళ్ళింటికి పంపేద్దాం!"

"మావయ్యా!" భయంగా చూసిందామె.

"చందనా! నాకు నువ్వు కావాలి చందనా! నీ ఆస్తి ఒక్క పైసా వద్దు! భగవంతుడి సాక్షిగా నాకే ఆస్తిపాస్తులూ వద్దు! నిన్నేం బాధలూ పెట్టను! కళ్ళల్లో పెట్టుకు చూసుకుంటాను చందనా! ప్లీజ్! వచ్చెయ్యి!" అతని కళ్ళల్లో నీళ్ళూరి అంతా మసగ్గా కనిపిస్తున్నారు.

చందన అతనికేసి నడిచింది. అందరూ వూపిరి బిగపట్టి చూస్తున్నారు.

అప్పుడే ప్రాణాలకి తెగించిన సారధి గభాల్న వచ్చి బాబుని ఇవతలికి లాగాడు.

అంతే ! రాఘవ చేతిలోని రివాల్వర్ పేలి బులెట్ సారధి గుండెల్లోకి దూసుకుపోయింది.

కుప్పకూలిపోయాడతను.

అంతా నిర్ఘాంతపోయి తేరుకోకముందే మరోసారి గర్జించింది రివాల్వర్.

తృళ్ళిపడి చూశారంతా.

రాఘవ కూడా కూలిపోయాడు. అతని తలనుంచి రక్తం ప్రవహిస్తోంది.

బిత్తరపోయిన దేవకి తేరుకుని ఒక్క అంగలో తమ్ముడి దగ్గరికొచ్చి, అతన్ని పట్టుకుని –

" ఎంతపని చేశావురా రాఘవా ! " అంటూ బావురుమంది.

చందనావాళ్ళుకూడా దగ్గరికొచ్చారు.

" అక్కయ్యా .... నా బతుక్కిది సరైన ముగింపే ! మీరేం బాధపడకండి ! " బలవంతంగా అన్నాడు రాఘవ.

" రాఘవా " .... ! శాంతారామ్ కూడా బాధగా అన్నాడు అతని చేతిని తన చేతిలోకి తీసుకుంటూ.

" నువ్వుకూడా ఏమిటి బావా ! " ఆయన కళ్ళలో వూరుతున్న నీళ్ళనిచూసి సన్నగా నవ్వి అన్నాడు రాఘవ. అతనికి ఆయాసం వస్తోంది.

" అక్కయ్యా ! " అన్నాడు అతి ప్రయాసగా,

" ఏమిట్రా " ఏడుస్తూనే అందావిడ.

" నాకో కోరిక వుండే. దీరుస్తావా ? " ఆశగా అడిగాడు.

" చెప్పు నాన్నా ! " అతని చెంపలు సున్నితంగా ఒత్తుతూ అంది దేవకి.

" నేను ఎలాగూ చచ్చిపోతానని నాకూ మీకూ కూడా తెలుసు .... బతికిన ఈ నాలుగు క్షణాలు .... " ఆయాసంతో అతనికి మాట రావడం లేదు.

" చెప్పు మావయ్యా ! .... ఈ నాలుగు క్షణాల్లో .... ఏం కావాలి ? " అతని చెయ్యి పట్టుకుని ఏడుస్తూ అంది చందన.

రాఘవ కళ్ళు చల్లగా నవ్వాయి.

" చందా ! .... నా కోసం ఏడుస్తున్నావా ? ఇంకా ఈ పాపిని చూస్తుంటే జాలిగా ఉందా ! "

" అలా మాట్లాడకు మావయ్యా ! చెప్పు ! నీకేం కావాలి ! " పళ్ళమధ్య కింద పెదవి నలిగిపోతూంటే .... దుఃఖాన్ని అతి ప్రయత్నంమీద ఆపుకుంటూంది చందన.

" చెప్పనా ! .... "

" ఊఁ ! చెప్పు మావయ్యా ! .... "

" ఈ రెండు క్షణాలూ నీ ఒడిలో తల పెట్టుకుని హాయిగా, నిశ్చింతగా తుది శ్వాస తీసుకోవాలనుంది చందనా ! "

" మావయ్యా ! "

" అవును చందా ! శాశ్వతంగా నీ వాడినవ్వాలని ఎన్నో ఘోర కృత్యాలు చేశాను. కానీ .... చిత్తుగా ఓడిపోయాను ! .... నా పాపాలకు ఇదే తగిన శిక్ష ! .... కానీ .... ఈ లోకంనుంచి శాస్వతంగా తప్పుకోబోతున్న నాకు ఈ ఆశ పట్టి పీడిస్తోంది ! నా ఈ కోరిక తీరకపోతే నా ఆత్మకి శాంతి లేదు ! ప్లీజ్ చందనా ! .... " అతికష్టంమీద అన్నాడు రాఘవ.

చందన చలించిపోయింది.

గభాల్న కూర్చుని అతని తలని ఒడిలోకి తీసుకుంది. రాఘవ కళ్ళు తళుక్కుమన్నాయి.

చందన కళ్ళలోని నీరు ముత్యాల్లా రాలి అతని చెంపని తడిపేస్తున్నాయి.

" చందా ! .... నాకిప్పుడు ఎంత హాయిగా వుందో తెలుసా ? " మత్తుగా అన్నాడు రాఘవ.

" రాఘవా ! " మెల్లగా పిల్చాడు సారధి.

కళ్ళుతిప్పి చూశాడతను. సారధి కళ్ళనించి కూడా నీళ్ళు ధారగా కారుతున్నాయి.

## సోస వెరైటీ

లిప్‌స్టిక్ పెదాల క్రింద
లెప్రసీ నాట్యం చేస్తున్నా
గాజు మేడల పైన
క్లాసికల్ శృంగారం సాగిపోతున్నా
ఖద్దరు బట్టల క్రింద
కుళ్లు రాజకీయం కల్లోలితం చేస్తున్నా
విభూతి రేఖల క్రింద
విద్రోహం సెగలు గ్రక్కుతున్నా
అదొక గొప్ప సొసైటీ
ఆధునిక యుగానికి వెరైటీ ...

బీటలువారిన పేద పెదాల క్రింద
నీతి వాక్యాలు వినదిస్తున్నా
ఓటి గుడిసెల మాటున
పాతివ్రత్యం పదిలంగా ఉన్నా
కష్టజీవి గుండెల్లో
కరుణ కడలి పొంగుతున్నా
ఇదొక అంటరాని సొసైటీ
ఆధునిక యుగంలో మైనారిటీ ...

- చేగిరెడ్డి శంకరరెడ్డి

" ఎందుకు ? .... ఇద్దరం దోషులమే ! " నవ్వాడు రాఘవ.

కబురందుకుని అప్పుడే వచ్చిన డాక్టర్‌ని దగ్గరకే రానీలేదు క్షతగాత్రులిద్దరూ కూడా.

" విలనంకుల్ ! " మెల్లగా దగ్గరికొచ్చాడు బాబు. వాడి కళ్ళనిండా నీరు !

" ఏమిట్రా ? " నవ్వాడు రాఘవ.

" అబ్బ ! ఎన్నాళ్లకి నవ్వావంకుల్ ! ఇక ఎప్పుడూ అలా నవ్వుతూనే వుండాలి ! సరేనా ? " .... అతని తల మీది రక్తాన్ని తన చొక్కాతో అద్దుతూ అన్నాడు బాబు.

" అలాగే ! నేనింక ఎప్పుడూ నవ్వుతూనే వుంటాను ! "

" సరే ! తొందరగా పద ! మా డాక్టర్‌అంకుల్ మందిస్తే ఎంత దెబ్బయినా ఇట్టే తగ్గిపోతుంది ! నిజం ! మొన్నెప్పుడో నేను పడితే మందేశారు. నిమిషంలో హూష్‌కాకి అయిపోయింది ! "

అక్కడున్న వాళ్ళందరికళ్ళూ అశ్రుపూరితాలయిపోయాయి వాడి మాటలకి.

" బాబూ ! .... నన్ను మర్చిపోవుగా ? " అన్నాడు రాఘవ కళ్ళెత్తి వాడికేసి చూస్తూ.

" ఉహుఁ ! "

ఓ సారి తలెత్తి అందరికేసి చూసి అతి ప్రయాసతో చేతులు జోడించి, ఆ తరవాత చందన కళ్ళలోకి చూస్తూ హాయిగా నవ్వాడు రాఘవ.

అంతే ! ఆ నవ్విన పెదవులు అలాగే నిల్చిపోయాయి.

గొల్లుమన్నారు అయినవాళ్ళు.

సారధికూడా అదే పరిస్థితుల్లో వున్నాడని గ్రహించారంతా.

" రాఘవా ! .... స్నేహితులమైనందుకు మన చావు కూడా చిత్రంగా ఇలా రాశాడు దేవుడు ! " అదోలా నవ్వుతూ అన్నాడు సారధి. అతని చెయ్యి రాఘవ కాలుని నిమురుతోంది.

" అంకుల్ ! విలనంకుల్ నిద్రపోతున్నాడు. మీరూ నిద్రపోండి ! డాక్టరంకుల్ మందిస్తారు అస్సలు నెప్పుండదు ! " దగ్గరగా వచ్చి అన్నాడు బాబు.

" అలాగే బాబూ ! ఇంక నిద్రపోతాను ! " కళ్ళు ఏడుస్తున్నా పెదవులు నవ్వాయి.

" ఇండికెళ్దాం పదండీ ! "

" అలాగే ! కానీ....బాబూ ! నన్ను నన్ను మర్చి పోవుగా ? "

" ఉఁహుఁ ! మిమ్మల్ని మర్చిపోతానా అంకుల్ ! మీరు మా అమ్మని చూపించారు ! " చందనని పట్టు కుంటూ అన్నాడు బాబు.

సారధి మొహం మరింత పాలిపోయింది.

" బాబూ ! " ఆర్తిగా చేతులు చాచాడు.

బాబు అతని చేతుల్లో కొచ్చాడు.

" ఛ ! ఎందుకు ఏడుస్తున్నావ్ ? నెప్పిగా వుందా ? " అన్నాడు అతని కళ్ళనీళ్ళు తుడుస్తూ.

" ఊఁ ! నువ్వు ఇంక మీ నాన్న దగ్గరికి వెళ్ళి పోతావ్గా ? " అతనికి ఆయాసంతో మాట రావడంలేదు.

" ఆ ! అమ్మకూడా వస్తానంది ! "

"అవును ! వస్తుంది ! అమ్మా ! చందనా ! " మెల్లగా పిల్చాడు సారధి.

" ఏవిటి ? " అన్నట్టు బాధగా చూసిందామె. రాఘవ ల ఇంకా ఆమె ఒడిలోనే ఉంది.

" నువ్వు....బాబుకి అమ్మగా....అతని ఇంటికి వెళ్ళ తున్నావా ? "

" అవును ! " అన్నట్టు తలూపిందామె. అతని కళ్లు తృప్తిగా చూశాయి. మెలగా జయంత్ అతని దగ్గరగా వచ్చాడు.

" జయంత్ ! "

అంతవరకు దుఃఖాన్ని అతి ప్రయత్నం మీద ఆపు కున్న జయంత్ అతని చేతిని తన చేతుల్లోకి తీసుకున్నాడు.

" బాబు........"

" నా కొడుకు !...." స్థిరంగా పలికిందతని గొంతు. సారధి కళ్ళు తళుక్కుమన్నాయి. రెండూ చేతులూ ఎత్తి " థ్యాంక్స్ ! జయంత్ ! " అన్నాడు అతిప్రయాసగా. ఎత్తిన ఆ చేతులు సగంలోనే పడిపోయాయి. (సశేషం)

# మంచు

మంచు – చలిమంచు – ముసుగుమంచు – దగామంచు
అది శీతనగ దరహాస మహస్సు
శీత వాతోద్ధూత హిమసుమ రజస్సు
ఖగములను లోహ విహగములను ముంచు
అది భాస్కరుని బాలారిష్ట తమస్సు
రాత్రి పాపానికి పగటి తాపానికి అర
అనర్థపు వృద్ధాప్యానికి దగ్గుతెర
రథ్యా వధ్యాలయ కాపురస్తులకు హరోంహర
ఇది మామూలు మంచు తప్పదు అనుభవించు.
మరొకటి రాజకీయపు ముసుగు మంచు
సామాన్య ప్రజానీకపు కొంప ముంచు
సమ్మెలు లొకాట్లు కాల్పులు యేడ్పులు
అణగిపోయిన సామాన్యుల గుసగుసలు
అసమర్థపు బ్రతుకు దుమ్ములో
ఇంకిపోయిన కన్నీటి జడుల తడులు
అర్థరాత్రి పూరి చివర
రక్కలి పొదపై రాలిన రక్తబిందువులు
ఈ మంచు ముసుగు పెచ్చదనంలో
విద్యార్థులు చదువులు త్యాగం చేస్తారు
రాజకీయవేత్తలు పదవులు స్వాహా చేస్తారు
యువకులు సమాధుల్లో శయనిస్తారు
పెద్దలు ప్రజానిధులు భోంచేస్తారు
ఇది వికృతి దరిలేని నిష్కృతి.
మంచు ముసుగులో గులాబీలు పూస్తాయి
బంతులు చేమంతులు హసిస్తాయి
చిగురాకులు మంచు చినుకులు చిటపటా నమలి
ప్రభాతాన మంచు ముత్యాలు నెమరులేస్తాయి
ఆలిన జీవన సత్యాల్లా మెరుస్తాయి
బ్రతుకు అనిత్యంలా హరిస్తాయి
ఇది ప్రకృతి – ఇది సుకృతి.
అజ్ఞానపు తమస్సు – ఇది పొగమంచు
జీవన నౌకను సుడిగుండములో ముంచు
అహంకారం చల్లగా – కామం అంధకారంగా
అజ్ఞానం చినుకు చినుకుగా ఆవరించే మంచు
బాలార్కుని ఉపాసించు
ఆ తపస్సు ఈ తమస్సుని హరిస్తుంది
బ్రతుకుబాటలో వెలుగురేఖ రహిస్తుంది.

– పింగళి వెంకట కృష్ణారావు

# వేదులవారి కమనీయ కావ్యకుసుమం

" నీచపు దాస్యవృత్తి మననేరని శూరత మాతృదేశ సే
వాచరణమ్ము నందసువు లర్పణ జేసిన వారి పార్థివ
శ్రీ చెలువారి చోట, దదస్రుగ్రుచులన్ వికసించి, వాసలన్
వీచుచు, రాలిపోవగవలెం దదుదాత్త సమాధి మృత్తికన్ "

## ధూర్జటి వేంకట బాలాజి

– అని లోకానికి వింత పరిమళాన్ని, తన సోయగంతో వింత అనుభూతిని కలిగించే ఒక వికసించిన కుసుమం అనుకోడం ఎంత ఉదాత్తమైన విషయం ! దీక్షతో, ఏకాగ్రతతో కరుడుగట్టిన దేశభక్తితో యుద్ధరంగంలో అశ్రువులర్పించిన మృతవీరుల సమాధులపై తాను జన్మించి, చనిపోయిన వారికి తన సుగంధ పరిమళాన్ని ప్రసాదించాలనెడి కోరికే ఎంత ఉదాత్తమైనది ! మరి ఒకపూవే ఆ విధంగా అనుకుంటే, ఇక మానవుడు, తన దేశం కొఱకు తను పుట్టినగడ్డ కొఱకు ఎంతటి త్యాగం చేయాలి చెప్పండి ! మనసుకు ఆనందం కలిగించే, ఊహించలేని గొప్ప అనుభూతిని ప్రసాదించే ఈ పద్యం 'దీపావళి' కావ్యంలోని 'కాంక్ష' అనే ఖండికలోనిది.

ఇరవయ్యో శతాబ్ది ఆధునికాంధ్ర సాహిత్య లోకంలో, మొదటిశ్రేణిలో ఎంపిక చేయబడ్డ అగ్రగణ్యులైన కవులలో శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారు అగ్రగణ్యులు. మిగిలిన సాహితీ ప్రక్రియల నెన్నింటిని చేపట్టినా, కేవలం కవిత్వంలోనే గాఢంగా కృషిచేసి గొప్ప కవులుగా రాణించారు.

జాతీయ స్వాతంత్ర్యోద్యమ సమరంలో, తమ దేశంపట్ల, తమ జాతిపట్లగల అచంచలభక్తి విశ్వాసాలతో, ప్రేమానురాగాలతో, జాతి ఔన్నత్యాన్ని వైశిష్ట్యాన్ని తెలిపే గొప్ప కవిత్వంవ్రాసిన ఆధునిక కవులలో శ్రీ వేదులవారు ఒకరు. మనసును పట్టి ఊపగలిగిన, కళ్ళనుపట్టి నిలపగలిగిన కవిత్వం వ్రాసి, నలుగురిచేత గొప్పకవి అనిపించుకొనగలిగారు. నిజానికి వేదులవారి కవితా వైశిష్ట్యాన్ని చెప్పగలిగిన ఏకైక కావ్యం " దీపావళి " ఒక్కటే. ఇందులో కవితా బంధురమైన, భావ ప్రధానమైన, జాతీయతత్త్వం ప్రబోధించే గొప్ప ఖండికలున్నాయి. ప్రతిఖండిక ఒక్కొక్క ఆణిముత్యం. ప్రతిదాంట్లో ఆయన తనదైన గొంతుకతో పలుకగలిగిన గొప్ప ప్రతిభావంతుడైన కవి –

'దీపావళి' ఖండకావ్యంలో ప్రధానంగా జయగీతి, కాగడా, కాంక్ష, ప్రణయమూర్తి, నిరీక్షణము, యాత్ర, ఒక్కక్షణము, ప్రేమ, నిష్కృతి, పెంపుడు, నెమలి, కృతజ్ఞత, ప్రతీకారము, నిరసనము, ఉత్కంఠ, ఈనాటికి, అవృత్తి, అశాంతి, ఏమగునో, కలువ, ప్రవాసి, భగ్నవీణ, దీపావళినాడు, ఎపుడో గీతములు, జ్వాల, ఆహ్వానము, పూర్ణిమ, సముద్ర తటాన, ప్రభాతగీతి, ఆషాఢ మేఘము, శరదుత్సవము, సుధాకరా ! సంధ్యాన్వేషణము, రాధ, ఆశాగానము, కన్నీటి పాటలు, రథయాత్ర, అంకితము, పేదబ్రతుకు, చకోరిక, ప్రభూ నీ కోసమే, పూవు, అభిసారిక, ముక్తావళి, నేడు, పూజా ప్రసూనములువంటి ఖండికలు ప్రధానంగా పేర్కొనదగ్గవి .

ఈ ఖండికలలో ఎక్కువ భాగం భావకవిత్వ ప్రభావానికి లోనై వ్రాయబడ్డవి, మరికొన్ని దేశభక్తి పూరితమైనవి. ఆధునిక కవిత్వంలో ఒక ప్రధాన భాగమైన

భావకవిత్వంలో ప్రధానంగా రెండు అంశాలు ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. ఒకటి ప్రేయసీరక్తి, రెండు దేశభక్తి. ప్రణయం, ప్రకృతి రెండింటిలో కొంతమంది ఊహా ప్రేయసులను సృష్టించుకొని వారి కొఱకు కవిత్వంరాస్తే, మరికొందరు తమ దేశంపట్ల, జాతిపట్ల గల ప్రేమానురాగాలను పురస్కరించుకొని వాటిని ప్రతిఫలింపజేస్తూ గొప్ప కవిత్వం రాస్తారు. వేదుల సత్యనారాయణశాస్త్రిగారు ప్రకృతి, ప్రణయాలతో పాటుగా దేశభక్తిని కూడా తమ కవితాగానం ద్వారా ఉద్బోధించారు. జాతీయ స్వాతంత్ర్యోద్యమ సమరపు అనుభూతులను తమ కవిత్వం ద్వారా వెలువరించి, తమ దేశంపట్ల, జాతిపట్ల గల అకుంఠిత ప్రేమానురాగాలను వ్యక్తం చేసారు.

వేదులవారి 'దీపావళి' ఖండకావ్యంలో, చెప్పుకోదగ్గ గొప్ప ఖండికలలో 'కాగడా' ఒకటి. ఇది ఆయన జాతీయ దృక్పథాన్ని దేశభక్తిని, పరిపాలనా దాస్యశృంఖలాలను ఛేధించడానికై, నిద్రాణమైన భరతజాతిని మేల్కొలపడానికి, వ్రాయబడ్డ దేశభక్తి పూరితమైన ఖండికలలో కాగడా' పేర్కొనదగ్గది. 'కాగడా' ఖండికలో ఆయన ఈ విధంగా సమస్త భారతావనిని తట్టి మేల్కొలుపుతారు- ఇందులో –

'వెలిగించు కాగడా వెలిగించవోయి !
ప్రళయరుద్రుని ఫాలభాగమ్మునందు
అతని నిశిత శూలాగ్రమ్మునందు
ఆతని నేత్ర గోళాంతమ్ములందు
జ్వలియించు శిఖాశిఖా జాలమ్ముతోడ
వేడిగా వాడిగా వెరపు గొల్పేదిగా
వెలిగించు కాగడా వెలిగించవోయీ !

* * *

అధికార దృప్తుల కర్ధమత్తులకు
భోగి దాసిగనున్న భూదేవి కొఱకు
చెక్కిన నేల రాల చెరసాల నడుమ
వధ్యశిలా వైభవం బిచ్చగించి
దేవులాడుచునున్న దేవుని కొఱకు

* * *

తొడమపీడిన పూవు త్రోవ చూడదు తీవ
ధూళిరాలిన పండుతో పోదు పాదపము
గాలి కలిసిన పాటకై పక్షి వెత పడదు
తరగ విరిగిన మహోదధి తీసిపోవదు

* * *

పూలకారు చివుళ్ళ పురిటి పొత్తిళ్ళ
గతముకై తలపేల క్షితికేల వగపు
అరణి మధించి, యజ్ఞాగ్ని రగిల్చి
వెలిగించు కాగడా, వెలిగించవోయీ
మంటికి మింటి కన్నింటికి మంటగా
వెలిగించు కాగడా వెలిగించవోయీ ! "

ఇందులో పేర్కొనబడిన నాలుగు అంశాలలో నాలుగు భిన్నమైన దృక్పథాలు గలవు. ఈ నాలుగు కూడా జాతీయతా భావాన్ని ప్రబోధించేవే ! ' భావమ్ ప్రధానమ్ కవిత్వం భావకవిత్వమ్, అన్న మాట కూడా భావ కవిత్వాన్ని విశ్లేషించినపుడు వచ్చినటువంటిదే ! ఇందలి వాక్యాలలో అభ్యుదయ భావాలు - అవన్నీ ఇందులో

**ఆశల హరివిల్లు**

మానసాకాశంలో
సుళ్ళు తిరిగిన దుఃఖ మేఘం
భోరున వర్షించింది
ఊరడిల్లు మిక
అదిగో ! ఆశల హరివిల్లు !

— ఆశ

గూడు కట్టుకొన్నాయి. మొత్తంమీద కవితనంతా చదివి నప్పుడు కవిలోని దేశభక్తి పూరితమైన మానవతా దృక్పథం గోచరిస్తుంది. 'గాలి కలిసిన పాటకై పక్షి వెతపడదు. తరగవిరగిన మహోదధి తీసిపోవదు' అన్న వాక్యాలు కవి మేధను, ప్రతిభను వ్యక్తం చేస్తాయి.

'దీపావళి' కావ్యంలో ప్రధానంగా కనిపించే అంశా లలో దేశభక్తి పూరితమైన ప్రబోధంతోపాటు, మానసిక వికాసాన్ని, ఆహ్లాదాన్ని కలిగించే గొప్ప అనుభూతి వర్ణన. ఏ అంశాన్ని చూచినా పరవశించిపోయి, అందులో కవిత నల్ల గలిగిన శక్తి ఆధునిక కవులకు ఉంది. ఈ శక్తి ఆంగ్ల సాహితీ సంపర్కంవల్ల ఆంధ్ర సాహిత్యంలోని కవులకు కలిగింది. అదే విధంగా వేదులవారు కూడా అనుభూతిని కలిగించే వర్ణనలు కావ్యంలోని పెక్కు ఖండి కలలో చెప్పారు. ముఖ్యంగా 'సుధాకరా!' అన్న ఖండికలో చంద్రుణ్ణి గురించి ఆయన గావించిన వర్ణన ఎంతో అపూర్వమైంది -

" ఓయీ ! సుధాకరా ! నిలువుమొక్క నిమేషము; నీ మహోదయ
చ్ఛాయలు సోకి నాయెడద సాగరమట్టులు పొంగుచున్న దే
వోయనుభూతి జీవిత సుఖోర్మ్మలపూర్వ విముగ్ధ నాట్యముం
జేయుచు బాడుచున్నవి వినిర్మలమోహనరాగ గీతికల్.
" ఓ యమృతాంశుమూర్తి ! యెటకో పరువెత్తెదు వాయు లీనమై
పోయెడు రాగరేఖవలె, మోయగరాని ప్రవాస దుఃఖమో
తీయని ప్రేమ వేదనయొ, తీరని కోరికయో, యెదో మెదం
గోయునె యేమొ రాల్చెదవమాన హిమాశ్రు కణాల నా వలెన్"

ఈ రెండు పద్యాలలో చంద్రుని గురించి తనకుగల అనుభూతిని, చక్కగా కవితామయం గావించారు శ్రీ వేదుల వారు. చంద్రుడు లోకానికి చల్లదనాన్ని ప్రసాదించేవాడు. అతని చల్లదనంలో లోకమంతా ప్రశాంతంగా ఉంటుంది. వేదులవారు కవిత్వీకరించిన ఈ రెండు పద్యాలలో గొప్ప భావుకత ఉట్టిపడుతుంది. సుదీర్ఘమైన సమాసాలలో వ్యక్తమైన గొప్ప భావన వేదులవారి నిశితమైన కవితా పటిమను వ్యక్తం చేస్తుంది. చంద్రుడు లోకానికి వెలుగు ప్రసాదించేవాడు. వెన్నెలను ప్రసాదించేవాడు. అతని మధురమైన వెన్నెల కలువలను సైతం వికసింపచేయ కలిగిన శక్తిగలది కాని చంద్రుడు కేవలం కలువల్ని వికసింపజేయువాడు మాత్రమే కాదు. లోకాన్ని సైతం రంజిల్లజేయువాడనే అర్థం చెప్పుకోవచ్చు.

'దీపావళి' ఖండ కావ్యంలో చెప్పుకోదగ్గ మంచి ఖండికలలో 'రాధ' ఒక్కటి పేర్కొన దగ్గది. రాధా కృష్ణుల ప్రేమతత్వం లోకానికి అపూర్వమైంది, ఆదర్శ పూర్వకమైంది. అసలు ఒక స్త్రీని ప్రేమించడం, ఆమె చేత ప్రేమింపబడటం ఒక గొప్ప అనుభూతి. అది ఒక గొప్ప వరం అది అందరికీ సాధ్యం కాదు. అసలు రాధను కృష్ణుడు ప్రేమించడంలోనూ, కృష్ణుని రాధ ప్రేమించడం లోనూ లోకమంతటికీ ఒక ప్రేమ ప్రదీపమైన వెలుగు కొరకు పడిన తపన కనిపిస్తుంది. అది సత్యం. దానిని వ్యక్తం చేయడానికి కవి శ్రీ వేదులవారు తమ "రాధ" ఖండికను ఈ విధంగా చమత్కరిస్తారు. కృష్ణుని గురించి రాధ పరంగా కవి చెప్పిన తీరు ఈ రీతిగా ఉంటుంది-

" పవన పులకిత చంద్రాతప ప్రసన్న
చారు శారదయామినీ సమయమందు
వీథివీథుల మధురలో వెదకి వెదకి
చేరుకొంటిని బృందావిహారు నిన్ను
దూరమున నుండి నీ మురళీరవమ్ము
హృదయమున సోకినంత మేనెల్ల మరచి
తిరుగుచుంటిని యమునానదీ వివిక్త
పులిన సీమల వెఱ్ఱినై పోయి నేను
రవి కరోద్దీప్త హిమశీకరమ్ము పోలె
రమ్యఫించము చిత్రవర్ణముల దొలుక

శిరము నూపుచు మోవిపై మురళి నూని
యేది మరియొకమారు వాయింపు మోయి ! ॥

మంజుల సుమావృతములోని మధురిమమ్ము
మధుర చంద్రాతపములోని మార్దవమ్ము
మృదు సమీరమ్ములోని పరిమళమ్ము
కలవు గోపాల ! నీ వేణుగానమందు
ప్రకృతి పులకింప, యమునా స్రవంతి పొంగ
భావము చిగుర్పఁ బిల్లనగ్రోవి నూది
పరవశంజేసి నన్ను । గోపాలకృష్ణ !
ప్రేమ తనివార ! నొకముద్దుఁ బెట్టుకొనుము ॥

– ఇందలి పద్యాలలో చిట్టచివరి దాంట్లో రాధ తన వలపులోని మూగబాధను కృష్ణునితో నివేదించుకొని, తన లోని కోరికను బట్టబయలు జేసింది. మధురాపట్టణం, యమునానది, యమునా తీరాన శ్రీకృష్ణుడు – చేతిలో పిల్లనగ్రోవి, చేతి కెదురుగ్గా రాధ, ఈ దృశ్యం ఎంతో అనుభూతి పూర్వకమైంది. మధురా పట్టణం లోని వీధు లన్నింటినీ వెదకి వెదకి, చివరకు నిరాశ జెందిన రాధ, కనీసం యమునానది ఒడ్డునైనా శ్రీకృష్ణుడు దర్శనమిస్తాడేమోననే ఆశతో, యమునకు వచ్చి కృష్ణుని గాంచి, కృష్ణునిపట్ల తనకుగల ప్రేమానురాగాలను వ్యక్తం జేసింది. గొప్ప భావుకతకు, ప్రేమతత్త్వానికి, ఉదాత్త శీలసంపదకు, పవిత్రమైన రాధాకృష్ణుల ప్రేమతత్త్వానికి ఈ పద్యాలు ప్రతీకలుగా నిలుస్తాయి.

'దీపావళి' ఖండకావ్యంలో చెప్పుకోదగ్గ మరో గొప్ప ఖండిక 'ఆషాఢమేఘము'; 'ఆషాఢస్య ప్రథమదివసే' అన్న సూక్తిలోని వైచిత్రి మనందరకూ తెలిసిందే గదా! విరహార్తుడైన యక్షుడు తన ప్రేమవృత్తాంతాన్ని మేఘం ద్వారానే పంపగలిగి తన దూత్య ఔన్నత్యాన్ని నిలుపుకొన గలిగాడు. ఆనాటి ప్రేమ వృత్తాంతాన్ని కాళిదాస మహాకవీంద్రుడు "మేఘసందేశం" అన్న పేరుతో గొప్ప కావ్యాన్ని వ్రాసి లోకానికి అందిస్తే, మన వేదులవారు, ఆ ప్రేమ వృత్తాంతానికి మూలమైన ఆషాఢమాసంలోని



మేఘాన్ని గురించి ఈ విధంగా వర్ణించారు. ఇందులోని మేఘవర్ణనలో గొప్ప భావుకత ఉంది. హృదయాన్ని తట్టి ఊపగలిగిన గొప్ప ఉద్వేగముంది. ఆ ఉద్వేగం, ఉత్కంఠత, భావదీప్తి సున్నగు అంశాలు ప్రస్తుత పద్యంలో ద్యోతకమౌతాయి.

"ఏ విరహార్తుడేని హృదయేశ్వరి సన్నిధి కేగుజాలు వా
ర్తావహుగోరి, యేగిరి నితంబతటమ్మున నేనిచిక్కి, వా
పోవుచునుండెనేమొ యని, పొంచి దెసల్ పరికించి చూచు చు
న్నావె ప్రవాస దుఃఖిత మనః ప్రవణోత్సవమా, పయోదమా !

లేదలనాటి యుజ్జయిని, లేదలకానగరీ ప్రయాణ స
మ్మోదము, లేదు ప్రేమభర ముగ్ధుడు నాటి గిరిప్రవాసి, భా
నూదయ చిత్రితేంద్ర ధనురుజ్జ్వల మూర్తి వి నీవె నాటి మ

ర్యాద ప్రవాసి బాంధవుడపై కనిపించెదవోయి నేటికిన్
తరుణీదూరులు, ప్రేమజీవన దరిద్రాణుల్,
నభోమాసకా
తరులౌ దీనుల దుఃఖ బాష్పకణ ముక్తాపాళి వార్తా
క్షరో
త్కరముంబోలె వహించి, యంబర పథాం తర్నిత్య
యాత్రాధురం
ధరతన్ మానవు నేటికిన్ ప్రణయదౌత్యం బీవు
మేఘోత్తమా ! "

– ఈ పద్యాలలో గొప్ప భావుకతతో కూడుకున్న శబ్ద శిల్పముంది. ఆనాటి యక్షునినుండి ఈనాటి ప్రేమికుని వరకూ అందరూ తమ వలపులోని మూగబాధను మేఘం ద్వారా ప్రేయసికి పంపడానికే నడుం కట్టారు. ఇందు చమత్కారముంది. ప్రేమికులకే కాకుండా, నూతనంగా వివాహమైన దంపతులకు కూడా ఆషాడమాసం వియోగాన్ని కల్పించి భేదాన్ని నింపుతుంది. తప్పదు ఇందులో ఇంకో విశేషముంది. నిజానికి ఈనాడు, ఆలనాటి అలకానగరం గాని, ఉజ్జయినిగాని, విరహార్తుడైన యక్షుడుగాని, అతని ప్రేయసిగాని లేరు. కాని వారందరికీ మూలమైన మేఘం మటుకు చిరస్థాయిగా నిలిచిపోయింది. ఆధునిక సాహిత్యం లోని భావకవిత్వంలోని ఒక ఛాయయే ప్రణయ కవిత్వం. ఆ ప్రణయ కవిత్వపు ఔన్నత్యాన్ని ఉన్నత శిఖరాలకు దర్శించిన మన వేదుల సత్యనారాయణశాస్త్రిగారు నిజంగా ధన్యులు కదా మరి !

"దీపావళి" ఖండకావ్యంలో ప్రకృతి, ప్రణయం, దేశభక్తి వంటి అంశాలను ప్రబోధించే వర్ణనలతో కూడు కున్న కవితలతోపాటు, భక్తిపూరితమైన కవితలు కూడా కొన్ని లేకపోలేదు. ఇందలి ఒక గేయంలో ఒక పుష్పం పరంగా కవి చిత్రించిన ఒక భావన. అందలి మాధుర్యం ఏమిటో మన కళ్ళ ముందుంచుతారు కవి శ్రీ వేదులవారు.

" కోసుకొనుము యీ కోమల కుసుమము
కోరి విరిసె నీ కోసమే స్వామీ !
తేనెల సోనలు తీరక మునుపే
తీయని వలపులు మాయక మునుపే
కోసుకొనుము యీ కోమల కుసుమము
కోరి విరిసె నీ కోసమే స్వామీ
విడిన రేకుగని వడలిపోవునో
తొడిమ వీడి పెనుధూళిని రాలునొ
చెడునొ వికసించిన మధుశోభలు
ఒడల పులకరింప పొదవగ నిపుడే
కోసికొనుము యీ కోమల కుసుమము
కోరి విరిసె నీ కోసము స్వామీ ! "

- ఇక్కడ తన్ను తాను అర్పించుకొనేతనం కనిపిస్తుంది. " ఆత్మార్పణం " గావించుకోడమనేది అన్నింటికంటే విశిష్టమైంది. " కోసుకొనుము యీ కోమల కుసుమము, కోరి విరిసె నీ కోసమే స్వామీ ! " అన్న మాటల్లో పూవు తనకుగల ఎంత నిజాయితీని ఉదాత్తంగా వ్యక్తం జేసిందో మనకు విదితమౌతుంది. " తొడిమ వీడిపెను ధూళిని రాలునొ। చెడునొ వికసించిన మధుశోభలు, ఒడలు పులకరింప పొదవగ నిపుడే " అన్న మాటల్లో పూవు వాడిపోతే ఎంత అంద విహీనమౌతుందో తాను తెలియచేస్తుంది.

స్వాంతంత్ర్యం సిద్ధించినవేళ, సర్వమానవాళి ఒక్కసారి మేల్కొంది. భారత సమస్త ప్రజానీకం, ఆనందోత్సాహాలలో పొంగి పోయింది. ప్రజావాహిని ఆనంద తరంగాలలో తేలియాడువేళ, కవికంఠం తన కలం బలంతో, వీనుల విందుగా కవితాగానం చేసింది. ఆ అనుభూతికి ప్రతిఫలమే నేటి ' జయగీత '. దేశభక్తి పూరితమైన ఖండికలలో " జయగీత " అగ్రగణ్యమైంది. కవిలోని దేశభక్తి ఒక్కసారి పెల్లుబికి ప్రవాహంగా మారి, సర్వమానవాళిని ఆనందంతో నింపివేసింది. ఆ ఆనందానుభూతే ప్రస్తుతం ఖండిక "జయగీతి"లో విదితమౌతుంది.

" అదె త్రివర్ణ ధ్వజ పటాంచల
ముదయ పవనోచ్చలితమయ్యెను
వదలె జయశంఖారవమ్ముల
నిదుర మైకమ్ము

వీరశౌర్యాసు పతుల తేజమ్ము
పేద భక్తియు సాధు దీక్షయు
వృద్ధ పౌరుష మొక్క సూత్రా
వేశమున వెలుగన్
కాల ఝూమోద్గత మహాగ్ని
జ్వాలకా మాలికలో ఝంఝూ
నిల విఘూర్ణిత నీల వాణం ;
నిధి తరంగములో
వెలువడియె నా సేతుశీతా
చలము నరనారీ సమూహము
నీ ప్రభాతోత్సవ ముహూర్తము
నేడు జనయిత్రీ ........
జయము హిమగిరి మణికిరీటా
జయము సింహళ పాదపీఠా
జయము విజయాంకి తలలాటా
జయము ప్రియజననీ ! ........ "

– ఎన్నో ఇక్కట్లు, కష్టాలు, సమస్యలు, బాధలు, దుఃఖాలు – వీటన్నింటిని అధిగమించి భారత ప్రజానీకం, స్వాతంత్ర్యం సిద్ధించుకోవడం వారి సుకృతం. అయితే కేవలం స్వాతంత్ర్యం పొందడం వరకే పరిమితం కాలేదు. దానిని నిలబెట్టుకోడంలో కూడా గొప్ప విశేషముంది.

"దీపావళి" ఖండకావ్యంలో అనుభూతి పరమై ఉన్నాయి. ప్రకృతి, ప్రణయం, దేశభక్తి, భక్తితత్పరత వంటి అంశాలను ఇతివృత్తాలుగా స్వీకరించి వ్రాయబడ్డ కవితలూ ఉన్నాయి. ఆధునిక కవిత్వంలో భావకవిత్వం ఒక చీలికలేక ఒక ప్రధానశాఖ అయితే, ఈ భావకవులందరికీ ఆచార్యులైన కృష్ణశాస్త్రిగారు భావకవితా విధాత. వారి తర్వాత నాయని, నండూరి, తల్లావఝ్ఝల, అడివి బాపిరాజు వంటి కవులు గణింపబడతారు. వారి కోవకు చెందినవారే నేటి మన వేదుల సత్యనారాయణశాస్త్రిగారు. విశ్వనాథవారి భావుకతకు కృష్ణశాస్త్రిగారి భావుకతకు ఎంతో భేదముంది. ఆ భేదం కృష్ణశాస్త్రిగారి "ఊర్వశి"ని, విశ్వనాథవారి "కిన్నెరసాని" ఒక విశాలమైన సాహితీ దృక్పథంతో అవగాహన చేసుకొంటేనేగాని అర్థంగాదు.

గోదావరీ మండలాన, భద్రాచలంలోని శ్రీరామచంద్రుని సన్నిధికి సమీపానగల "పర్ణశాల" గ్రామంలో జన్మించి

కం॥ ఊరక వచ్చిన చాలును
ఊరంతయు కోరి కొనెద ముత్తమ రీతిన్
నోరు కదుప పొసగదు చె
య్యారగ వెచ్చింప ధవము అడిగినతోడన్
– కిరి

సంస్కృతాంధ్ర సాహిత్యాలను క్షుణ్ణంగా అభ్యసించి, తనదైన గొంతుకతో చెప్పగలిగిన ప్రతిభావంతుడైన కవి శ్రీ వేదుల. జీవితాన్ని అన్ని వైపులనుండి దర్శించి, తనకు ఏం కావాలో తెలుసుకుని దాని కొఱకు కృషి చేయగలిగిన సాహితీపరులు శ్రీ సత్యనారాయణశాస్త్రిగారు. ఆయన పద్యం రాసినా, పాట రాసినా, కవిత రాసినా – కథ రాసినా ఆధునిక సాహిత్యలోకంలో, ఏ ప్రక్రియను చేపట్టినా అన్నింటిలోనూ తాను తానుగా నిలబడగలిగిన ప్రతిభావంతుడైన కవి, కథకుడు, గేయ రచయిత.

ఇరవయ్యో శతాబ్ది ఆధునిక తెలుగు సాహిత్యంలో "దీపావళి" వేదులవారి ప్రతిభా పాటవాలను వ్యక్తంచేసే కావ్యం ! దీనివలననే ఆయనకు "గౌతమీ కోకిల" అనే బిరుదు వచ్చిందని భావింపవచ్చునేమో మరి !

గోదావరి తీరాన నిలబడి కవితాగానం చేయబడటం వలన, శాస్త్రిగారికి "గౌతమీకోకిల" అనే బిరుదు వచ్చిందని భావించాలి.

వేదుల –

ఆధునిక తెలుగు సాహిత్యంలో ప్రణయకవిగా, భావకవిగా, ఆధునిక కవిగా నిలబడ్డారు.

ఆయన "దీపావళి" ఆధునిక తెలుగు సాహిత్యంలో నిలచిపోయే కావ్యాలలో ఒకటి –

" జయంతితే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశః కాయే జరామరణ జంభయమ్ "



# వాల్మీకి చరిత్ర, రఘునాథనాయకుని వ్యంగ్యము

రఘునాథనాయకుడు, శ్రీ కృష్ణదేవరాయలవారి తరువాత అంతటి కవి. అంతటి మహాప్రభువు వాల్మీకి చరిత్ర, రామాయణములను రెండు గ్రంథములపై ఆయన కీర్తి ప్రతిష్ఠలు నిలబడినవి. దారి దోపిడి దొంగగా బ్రతుకుచున్న కిరాతుఁడొకఁడు, ఋషుల ప్రబోధమున దాను ఋషి యగుట, తరువాత కవి యగుట, శ్రీమద్రామాయణము వ్రాయుట యనునవి యిందలి కథాంశములు.

**కాజ లక్ష్మీనరసింహారావు**

ఈ శతాబ్దియందు రచయితయయిన ప్రతివాడు మహాకవిగానే పరిగణింపఁబడుచున్నాఁడు. తత్పూర్వాంధ్ర కవులయందు ఇద్దఱో, ముగ్గురో మాత్రమే మహాకవులని ప్రసిద్ధి కెక్కిరి. కృష్ణదేవరాయల వారిని గూడ మహాకవి యనలేదు. రఘునాథనాయకుడు సామాన్యుఁడగు కవికాడు. వాల్మీకి చరిత్రయందు వ్యంగ్య వైభవమున్నది. కవి యగుటకు ముందు ఋషి కావలయునన్న మహార్థమును వాల్మీకి చరిత్రయందు, రఘునాథుడు స్థాపించెను. ఇది ధ్వని మార్గమున జేయఁబడినది.

ఈ కథయందు రఘునాధుఁడు ప్రయోగించిన శబ్దముల వ్యుత్పత్త్యర్థములను బరిశీలించి సమన్వయము చేసినచో ఋషిత్వమునకు గవిత్వమునకుఁగల విశిష్టమగు సంబంధము ప్రతీయమానము గాగలదు. రామాయణము వ్రాయు వాఁడెట్టి వాఁడు కావలయును? ఋషి కావలయును, సాక్షాద్భగవంతుఁడే కావలయును.

వాల్మీకి మొదట కిరాతుఁడు. వానికి భార్యయున్నది. బిడ్డలున్నారు. ఇతడు గృహస్థుఁడు గనుక వారిని బోషింపవలసిన బాధ్యత యున్నది. ఇది లోక సామాన్య లక్షణము. అందుకై యతఁడు త్రోవ కాచి, తెరువరులను గొట్టి సంపాదించును. కిరాతుని భార్య పరమ సౌందర్యవతి. అతఁడామె కొఱకెట్టి యకార్యమునేని చేయును. ఆమె తన మాట దాటదని వాని విశ్వాసము. కిరాతునికి వైరాగ్యము కల్గినది. ఇందుకు ఋషుల ప్రబోధమొక కారణము. కిరాతుని భార్యయొక్క కాఠిన్యము వేఱొక కారణము కిరాతుఁడు ఋషి యగుటకు ఇతర ఋషులు శాంతి మార్గమున ప్రబోధించిరి. కిరాతుని భార్య కఠినమార్గము పూనినది. తాత్పర్యమున కిరాతుఁడు వైరాగ్యము పొందెను. శాంతి పొందెను. జ్ఞానియయ్యెను. ఋషి యయ్యెను. రసావిష్టుఁడగు కవి యయ్యెను.

హింసింప వచ్చిన కిరాతునితో ఋషు లిట్లనిరి. కం॥ "ప్రాయము జలకల్లోల, ప్రాయము, కాయంబున స్థిరం బిందులకై రోయక దురితమె తపమని పాయక చేసెదవు నిందఁబరగఁబుళిందా" ఈ వయస్సు, శరీరములు అస్థిరములు, వీనియందు నీకు రోత పుట్టుటలేదా? అని రోయుట యనఁగా అసహ్యము కలుగుటయని యర్థము. ఋషులింతకంటె విశేషార్థమును భావించిరి. రోయుట యనఁగా అన్వేషించుట యను నర్థవిశేషము గలదు. అస్థిరములయిన వయశ్శరీరములు విడిచి దేనిని అన్వేషింపవలయును? ఏది స్థిరమయినదో దానిని వెదుకవలయును. అది యేది? చివరకు కిరాతుఁడు పొందిన "అనూన జ్ఞానము" స్థిరమైనది. దీనికై యత్నింపుమని ఋషులు కిరాతుని ప్రబోధించిరి. ఘోరపాపము లాచరించుచున్న కిరాతునితో సంభాషణ ప్రారంభించినంతనే కిరాతుని

యందు – "వారి ముఖాలోకనమున జ్ఞానము పొడమగా" దొడఁగెను. ఋషులను దర్శించినంత మాత్రమున కిరాతులందఱ యందిట్లు జ్ఞానము పొడముసా ! ఈ కిరాతుఁడు కిరాతమాత్రుఁడు కాడు. వానికి "అనాది సుకృత వాసన" యున్నదని కవి చెప్పెను. ఆ వాసన యెట్లున్నది ? ఎక్కడ నున్నది ?

కిరాతుని "యుల్లంబునఁగొంత శాంతి పల్లవించి"నది. ఉల్లమనఁగా లోపలి మనస్సు. దీనినే అంతఃకరణ ప్రవృత్తి యందురు. ఇందు శాంతి యున్నది. అది మోడువారి యున్నది. ఋషి దర్శనము వలన చిగురించినది. కాబట్టి యీ కిరాతుఁడు వట్టి కిరాతుఁడుగాక, యుత్తమ బహు పూర్వజన్మకృతి సుకృత వాసన కలవాడని నిర్ధారింపఁబడినది. వాసన యున్ననే గాని రసాస్వాదన జరుగనేరదు. కిరాతుఁడు రాతి గుండె కలవాడే యయినచో ఆతని యందు పల్లవించినదని చెప్పఁబడిన శాంతము రసమే కాకపోవును. అట్టి యెడ కిరాతుఁడు ఋషి కానేరఁడు. కిరాత, పుళింద, నిషాద, చండాలాదుల యందు గలుగునది శాంతాభాసమే కాని శాంతరసము గానేర్దని సర్వ పూర్వాలంకారిక నిర్ణయము – కిరాతుని యందు శాంతముద్భవిల్లుటకు గారణము– వారి (ఋషుల) ముఖాలోకనమని కవి చెప్పుచున్నాఁడు. శాంత రసోద్దీపన హేతువిదియే. "మహాపురుష సంగాద్యాస్తథోద్దీపన రూపిణః" కిరాతునికి జ్ఞానము కల్గుట, యుల్లమున గొంత శాంతి పల్లవించుట చెప్పఁబడినవి. శాంతము, జ్ఞానము అనునవి ఋషి లక్షణములే.

ఋషులు కిరాతుని గూర్చి యిట్లడిగిరి. "ఓరోరి, నీవు చేసిన ఘోరపుఁ బాపములు నీవు, గొడుకులు నాలుం, జేరబడి పంచుకొందురో" అని "మునులార ! యుత్తెరంగా, లిని బిడ్డల గొబ్బునందెలిసియే వత్తున్" అని కిరాతుఁడు ఋషులకుఁ జెప్పెను. కిరాతుఁడింటి ముఖము పట్టెను. రఘునాథనాయకుల వారిచ్చట రెండు పద్యములు వ్రాసిరి. కరాతుఁడు ఋషి దర్శన ఫలితముగా జ్ఞానియై పరివర్తనము చెందినాఁడన్న మహార్థమునకు వ్యంజకముగా వ్రాసిరి.

## యువశక్తి

ప్రభాత కిరణం నీవు
ప్రభంజన వేగం నీది
అలసట ఎరుగని అలవు నీవు
ఓటమి తెలియని శక్తివి నీవు !

నీతిని కొలిచే మనసే నీది
ధర్మం తప్పని దారే నీది
ధర్మాధర్మాల కొలబద్దవు నీవు
ప్రగతి రథానికి సారధి నీవు !

చైతన్యానికి చమురువు నీవు
భవితవ్యానికి వెలుగువు నీవు !

- మాజేటి ఆనంద్

మ॥ చని మార్గంబున నేణ వర్గములనేఁచంబోక,
లక్షించి ప
క్షిని కాయంబులఁ గొట్ట కోరక, మదిన్ జింతా
భరంబెంతయున్
ఘనమై యెక్కఁగ ఒక్కణంబునకు వేగంబోయి
యాచక్కఁ జ
క్కని తాటింటికి నేఁగి వ్రేఁకమగు కాకన్
వెచ్చగా నూర్చుచున్.

కం॥ విలునమ్ముల నటువైచుచు
నలసత నొక జింక తోలు నందున గూర్చుం
డిల వ్రాయుచు .... కిరాతుఁడున్నాఁడు. ఇంటికిఁ బోపు త్రోవలో ఎదురుగా వచ్చుచున్న లేడిని హింసించుటలేదు. పక్షులను గొట్ట తలఁచలేదు. వేడి నిట్టూర్పులు పుచ్చుచున్నాడు. ఇంటికి వచ్చి భార్యతో మాటలాడవలయునన్న యా వేగముతో విల్లును బాణములను ఆవల పారవేసినాఁడు. ఇది ఈ రెండు పద్యములలోని వాచ్యార్థము.

ప్రతీయమానార్థమిట్లుండును. మార్గమున దన కెదురై వచ్చు లేళ్ళను గిరాతుఁడు హింసింపలేదనఁగా నేమి? లేడి యనఁగా మృగము, వేఁటకాడు దీనిని వెదకినగాని దొరకదు. వెదుకబడునది గావున ఘృగమని యర్థము. ఇట్లుండఁగా, విల్లునమ్ములు దాల్చిన కిరాతునకు మృగములు ఎదురు వచ్చుటయేమి? కిరాతుని వలన తమకు భయము లేదని యా లేళ్ళకుఁ దెలిసినదా? లోకములో నిట్లుండునా? ఉండును. ధనుర్ధారియయిన దిలీపుడు వచ్చుచుండఁగా, లేళ్ళు నిర్భయముగా నెదురు వచ్చి చూచినవని కాళిదాస మహాకవి రఘువంశములో వర్ణించి యున్నాడు – కిరాత రూపమున నున్నను వాని జీవుఁడు పొందిన జ్ఞానమును పై వర్ణన సూచించుటను భావుకుఁడు గుర్తింపఁగలఁడు. త్రోవ కాచి కొట్టువాడు, ఎదురై వచ్చిన వానినిగూడ గొట్టకుండుట వాని శాంత స్వభావనకు వ్యంజకము –

చని మార్గంబున....అను పద్యములోని “మార్గమ” ను శబ్దము కూడ పరిశీలింపదగినది. మార్గశబ్దము మృగ ధాతు జన్యము – వెదకుట యని యర్థము – ఋషులు కిరాతుని జూచిన మొదటిసారిగా దేనినిగూర్చి “రోయు” (వెదకుము) అనిరో, తత్ప్రబోధమున గిరాతుఁడు దానినే చేయుచున్నాడని సూచించుటకై రఘునాథుఁడిచ్చట “మార్గ” (వెదకుట, త్రోవ) శబ్దమును బ్రయోగించెను.

కిరాతుఁడింకను చేసినదేమి? “ చక్కని తాటింటికి నేఁగి వ్రేఁకమగుకాకన్ వెచ్చగా నూర్పుచున్” ఉన్నాఁడు. వాఁడు తన గుడిసెలోనికి వెళ్ళి, వేడి నిట్టూర్పులు వదలుచున్నాఁడని వాచ్యార్థము. ప్రతీయ మానార్థమిట్లున్నది. తాటింటికి నేఁగుట యనఁగా ఋషులు నివసించుటకుఁదగిన బర్ణశాలా ప్రవేశము చేయుటయని, వ్రేఁకమగుకాకన్ – అనఁగా కిరాతుని జీవుఁడు పొందుచున్న వేదన యని యర్థము.

విలునమ్ముల నటువైచుచు – జింక తోలునందున గూర్చుండినాఁడు. భార్యను బ్రశ్నింపదలఁచినపుడు ఆవసరము లేని విల్లు, అంబులను ప్రక్కన బెట్టుట, తన గుడిసెలోఁగల ఒక జింక తోలుపై కూర్చుండుట, ఊరక చేతితో నేలపై వ్రాయుట యివి యన్నియు వాచ్యార్థములే. కిరాతదశ వదలి పూర్వజన్మ కృత సుకృత వాసనా బలమున ఋషిత్వము పొందుచున్న పరిణామ దశను పై వర్ణన సూచించుచున్నది. విలునమ్ములు నటువైచుచు – అనఁగా హింసా ప్రవృత్తిని సంపూర్ణముగా పారద్రోలినాఁడని వ్యంగ్యము – జింక తోలుపై కూర్చుండినాఁడనఁగా లేడి చర్మముపై తపశ్చర్యానుకూలముగా ఆసీనుఁడైనాఁడని వ్యంగ్యము – ఇల వ్రాయుటయనఁగా శ్రీమద్రామాయణ ప్రారంభించుట యన్నది వ్యంగ్యము.

కిరాతునకు భార్య యన్నచో ప్రేమ యధికము. తన కామె సౌందర్యవతిగా భాసించును. ఆమె యందగత్తెయని కవి వర్ణింపలేదు – “ అక్కిరాతుండు తన యంగనను గనుగొని, ” నాడని చెప్పెను. ఆమెను అంగనయని – ఆవయవిక సర్వసౌందర్యమును గవి ప్రసన్నము చేసెను. కిరాతుఁడు భార్యనిట్లు పిలిచెను – “ ఓ పడతీ ” ఈ సంబోధనకూడ తత్సౌందర్య ప్రతిపాదకమే కిరాత స్త్రీకిని తన సౌందర్యముపట్ల ఒక అభిమానమున్నది. నా పాపములో నీవు భాగము పంచుకొందువా యని ప్రశ్నించిన కిరాతున కామె తన తిరస్కారముమ మాటలతోఁగాక చేష్టద్వారా తెలిపినది.

“ అనవిని యచ్చెలి నగుచున్, విను నాయక ! ”

నీదగు పాపమునకు నాకుఁ బనిలేదన్నది. ఇచ్చట కిరాతుని భార్యయొక్క నవ్వు ఆమె కిరాతుని లక్ష్యపెట్టుట లేదన్న భావమును సమర్థించుచున్నది. కిరాత స్త్రీ తన భర్తను – “నాయక” యని సంబోధించినది. నాయకుఁడనఁగా భర్తయను సామాన్యార్థమున్నది. కాగా కావ్య నాటకములయందు నాయకుఁడుండును. కథ యందలి సకల పాత్రలను తన వెంట నడిపించి, చివరకు ఫలితము నొందువాఁడని నాయక శబ్దమునకు నిర్వచనము. ఫలితమంతయు నాయకునిదేగాని యితరులది కాదు ఆ రీతిగా, కిరాతుఁడు భార్యాబిడ్డలను పోషింపవలయునేగాని, అట్లు పోషించుటలో వచ్చు సర్వఫలము ఆ కిరాతునకే చెందుననీ తమకు

సంబంధములేదని . యింత నిగూఢమగు భావమును - నాయక ! అను సంబోధనలో, కిరాత స్త్రీ యిమిడ్చినది.

కిరాత స్త్రీకి ఇంతటి కాఠిన్యమేల వచ్చెను ? ఆమెకు భర్తపై ప్రేమలేదా ! ఉన్నది. కాని ఆమె యీశ్వరేచ్ఛాను సారము ప్రవర్తించినది. తన భర్త కిరాతుడుగా నుండ రాదు. అతడు ఋషి కావలయును. రామాయణమును వ్రాయవలయును. ఋషులయొక్క, కిరాతుని భార్యయొక్క తాత్పర్య మొక్కటియే.

కిరాత స్త్రీ తన యెడ గాఠిన్యము వహించిన కారణ మున కిరాతునియందు నిర్వేదము కల్గినది. అనిష్టప్రాప్తి కలిగినది. అనిష్టప్రాప్తియనగా, ఇష్టులైన వారి మరణమే కానక్కరలేదు. వారి సంగమము తిరిగి తటస్థింపనే తటస్థింపదని నమ్మకము కలుగుటచేత ఏర్పడు నిరపేక్ష భావముకూడ అనిష్టప్రాప్తియే. ఇదియే కరుణరసము - " ఇష్టనాశాత్, అనిష్టప్రాప్తేః కరుణాఖ్యో రసోభవేత్ "

తాను ప్రేమించిన భార్యయు, బిడ్డలును తన పాప మును పంచుకోజాలమని చెప్పినపుడు రావలసిన కోపము కిరాతునకు రాలేదు. అతనికి ఆలోచన వచ్చినది. జ్ఞానము వచ్చినది. " మోసపోయితి నిన్నాళ్ళు నాసదగిలి ఆలు బిడ్డలు చుట్టాలని వీరికేను పాటుపడుట వృథ " యని తలచినాడు. ఇది సమ్యక్ జ్ఞానము. తృష్ణాక్షయ సుఖము - "రోసితి, సంసారము దెగగోసితి" నన్నాడు. ఏ దశలో దుఃఖముగాని, ప్రపంచ సుఖముగాని, రాగ ద్వేషములుగాని, యిచ్ఛగాని లేవో ఆ దశయే శాంతము. ఇది మోక్షావస్థయందు లభించును. కిరాతుడీ స్థితికి వచ్చెను. " సంసారము రోసితి " నన్నాడు. ఇది ఋషుల ప్రబోధమే. అంతఃకరణమున శాంతిని బల్లవింపజేసికొని, మోక్షసాధనకు వలసిన జ్ఞానార్జనము చేసిన

## ఎండుటాకులు

అతడు
నడిచే
బాటలో
ఎండుటాకులు
ఉన్నాయి.
పాదాల
కిందబడి
నలుగుతున్నాయి
అతడి
మ్రోల
నోరు మెదపక
అణగి మణగి ఉన్నాయి
ఈదురు గాలి
 వస్తేనేగాని,
అవి గలగలమని లేచి
 ఎగరవు.

— ఉమ్మెటి విఘ్నేశ్వరరావు

వాడైన కిరాతుడు ఋషియైనాడు. లోక సంగ్రహార్థము రామాయణము వ్రాయవలయును. అందుకు కవి కావల యును. కవికి వాక్సిద్ధి కావలయును. మునీంద్రుల చరణ రేణు సంస్పర్శనంబున - వానికి " వాక్పాటవము " వచ్చినది.

కవికి వాక్పాటవ ముండవలయును. కవి యగుటకు ముందు ఋషిత్వము ముఖ్యము - రఘునాథనాయకుల వారి వంగ్యవైభవ మిట్లున్నది. 

# అంటార్కిటా ఖండానికి అందం పెంగ్విన్

— డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు

అంటార్కిటా ఖండానికి అందం పెంగ్విన్ పక్షి



అంటార్కిటా ఖండాన్ని తలచుకోగానే ముందుగా గుర్తొచ్చేవి పెంగ్విన్ పక్షులు. ఎగరటం మరచిపోయి, మనిషిలా నిటారుగా నిలబడి నడవటానికి అలవాటుపడిన ఈ పక్షి జాతి ఒక మంచు ఖండాన్ని నివాసానికి ఎందుకు ఎంచుకుందో అర్థంకాదు. కాని అక్కడ వీచే అతి శీతల ( —40°c ) గాలులను తట్టుకుని నిలబడేందుకు అవసరమైన అన్ని శరీర మార్పులను సంతరించుకున్నాయి పెంగ్విన్ పక్షులు.

మరే ఇతర పక్షి శరీరంమీద లేనంత దట్టంగా ఈకలు పెంగ్విన్ మీదుంటాయి. అంతేకాకుండా చర్మం క్రింద మందంగా కొవ్వు పదార్థం నిలవచేయబడుతుంది. ఈ రెండింటివల్ల ఇవి చలిగాలులనుంచి రక్షణ పొందుతాయి. పెంగ్విన్ రెక్కలు తెడ్లగా మార్పు చెందాయి. కాలివేళ్ళ మధ్య తెడ్డులాంటి చర్మముంటుంది. వీటి సాయంతో పెంగ్విన్ సుమారు పది నాటికల్ మైళ్ళ వేగంతో ఈదుతుంది. నీటిలో మునిగినపుడు ఏ వస్తువైనా సహజంగానే కొంత బరువును కోల్పోతుంది కదా ! అదే సమస్యను తట్టుకునేందుకు పెంగ్విన్ పక్షులు రాళ్ళను మింగుతాయి. వీటివల్ల పెంగ్విన్ బరువు పెరిగి ' బాలన్స్ ' కుదురుతుంది. పెంగ్విన్ జీర్ణ వ్యవస్థలో 6 కిలోల బరువు కల రాళ్ళను గమనించటం జరిగింది.

మొత్తం పదిహేడు జాతుల పెంగ్విన్ పక్షులు నేడు కనిపిస్తాయి. వీటిల్లో అన్నిటికన్నా పెద్దదైన ' ఎంపరర్ పెంగ్విన్ ' ఒక మీటర్ ఎత్తుకు ఎదుగగా, అతి చిన్నదైన ' లిటిల్ పెంగ్విన్ ' ముప్పయి సెంటీమీటర్ల ఎత్తు మాత్రమే వుంటుంది.

సాధారణంగా మగ పక్షులు తన పాటతోగాని లేదా రంగు రంగుల ఈకలతోగాని ఆడ పక్షిని ఆకర్షిస్తాయి. కాని పెంగ్విన్ జాతిలో మగ, ఆడ పక్షులకు ఒకే రకం ఈక లుంటాయి. మగ పక్షికి పాడే శక్తి లేదు. అందువల్ల జోడును వెతుక్కునేందుకు కొత్త పద్ధతిని నేర్చుకుంది. ఏప్రియల్ మాసం ఆరంభంలో ఎంపరర్ పెంగ్విన్ పక్షులు నీటిని వదిలి ఒడ్డుకు చేరతాయి. మగ పక్షి ఒక రాయిని నోటితో తీసుకవెళ్ళి దగ్గరలోవున్న మరో పక్షి ముందు పడేస్తుంది. అది ఆడ పక్షి అయితే ఆ రాయిని ముక్కుతో తాకి తన అంగీకారాన్ని తెలియచేస్తుంది. ఆ విధంగా జంట కలిసిన పెంగ్విన్ పక్షులు చిన్న చిన్న రాళ్ళను పోగుచేసి తమ గూటిని నిర్మించుకుంటాయి.

గుడ్డు పెట్టేవరకు ఆడ పక్షి నీటిలోకి దిగదు. ఆహారం తీసుకోదు. సాధారణంగా పెంగ్విన్స్ ఒకటి రెండు

( తరువాయి 54వ పేజీలో )

# రంజనిమాల

సంకలనం
డా॥ వి. ఫణీంద్రుడు

### ఆ ధా ర ము లు *

చరిత్రలో పేరుపొందిన ఈ వ్యక్తులు : ముర, ఆరుద్ర, గౌరన, పాపమ్మ, పికిర, సుశర్మ, గోపీచంద్, రామదాసు, వరదయ్య, శరభోజి, అగస్త్యకవి, గంగయదేవ, జియ్యరుసూరి, పిల్లలమర్రి, బయలునంబి, రామారాయడు, బాలసరస్వతి, రాణి అమ్మక్కమ్మ, అహమ్మద్ బహిరి, ఆనందగజపతి, పల్లవి గోపాలయ్య, అచ్యుతదేవరాయలు, అచ్యుతప్పనాయకుడు, మాధవవిద్యారణ్యుడు, గోపే సూర్య ప్రకాశరావు, యడవల్లి సూర్యనారాయణ, తల్లాప్రగడ సూర్యనారాయణరావు – ఈ దిగువ ఆధారములతో వారి పేర్లను అమర్చి రంజనిమాలని పూరించండి.

## అడ్డము

1. విజయనగర ప్రభువు 4. ఒక కవి ఇంటి పేరు 6. విజయనగర రాజ్యస్థాపనకు కారణభూతుడు 7. అనకాపల్లి కరకవలస జమిందారు 11. శ్రీ కళా కల్లోలిని రచయిత 12. అహోవమల్లదేవర సేనాపతి 13. గుత్తిని పరిపాలించిన తెలుగు చోడుడు 15. విద్యా నాధుడను బిరుదు కలవాడు 16. చంద్రగుప్తుని తల్లి 17. రాణి చొక్కమ్మ కుమార్తెల పర్యవేక్షకుడు 19 భక్తజన పారిజాతమను ప్రబంధమును రచించిన సంగీతజ్ఞుడు 21. ద్విపద భారతములో సభాపర్వము రచించిన కవయిత్రి 22. కణ్వవంశీయుడైన మగధ రాజు 23. గద్వాల రాజ్య భారాన్ని వహించిన స్త్రీ.



## ని లు వు

1. తంజావూరు రాజ్యమును ఏలిన చంద్రవంశరాజు 2. "కావ్యకళానిధి", "భాషాపోషక" బిరుదాంకితుడు 3. "పాదుకా పట్టాభిషేకము" రెండవ చలన చిత్రములో రాముడుగా నటించిన వ్యక్తి 4 రెండవ సింహవర్మ పల్లవుని ఈ శాసనము 5. దేగను తమ వంశ చిహ్నముగా ప్రకటించిన ప్రభువు 7. 'అసమర్థుని జీవయాత్ర' రచయిత 8. తంజావూరును పరిపాలించిన మహారాష్ట్రి ప్రభువు 9. తన నక్షత్రం కలం పేరుగా వాడిన రచయిత 10. గురజాడ అప్పారావు ఇతని ఆస్థాన శాసన పరిశోధకులు 14. క్షేత్రయ్య అసలు పేరు 17. "పలుకే బంగారమాయెను", ఇతని కీర్తన 18. ఇతని ద్విపద "హరిశ్చంద్ర మహారాజు చరిత్రము" కావ్య గౌరవము పొందినది 20. మద్రాస్‌లో ఈమె పేరుతో వీధి పేరుండేది.

ఫిబ్రవరి సంచిక సమాధానములు 55వ పేజీలో

# రామచంద్రమూర్తి కంగారుపడిపోయాడు.

## తన ముఖంలో ఏమయినా కోతులాడుతున్నాయా ?

### ఎందుకలా ఆమె తన ముఖంలోకే చూస్తూ బొమ్మలా ఉండిపోయింది ?




అరె !

ఆమె....

స్పృహ తప్పుతున్నట్లు....

మూర్ఛపోబోతున్నట్లు....

అసంకల్పితంగానే అతను ముందుకి ఉరికాడు.

నేల కూలిపోవలసిన ఆమెను చటుక్కున పట్టుకున్నాడు. ఆపాటికి దయానిధి – ఆలోచనల లోంచి తేరుకున్నట్లు అటుచూసి –

"ఏమైంది ?" అనడిగాడు తెల్లబోతూ.

"ఈమెకు స్పృహ తప్పింది నడుస్తూండగానే. మూర్ఛ జబ్బుందేమో....మెళ్ళో మూర్ఛబిళ్ళ మాత్రం లేదు".

"ఉండు....ఆ ఫౌంటెన్ లోంచి నీళ్ళు తెస్తాను". అని–లాన్ మధ్యనున్న ఫౌంటెన్ వేపు వేగంగా నడిచాడు. కుండీతో కట్టిన కొలను. దానిలో ఫౌంటెన్. కొలనులో తామర ఆకులు. ఒక ఆకు కోసి – దొన్నెలాచేసి, నీరు నింపి జాగ్రత్తగా తెచ్చాడు దయానిధి.

అప్పటికి –

రామచంద్రమూర్తి ఆమెను కూర్చోబెట్టి .... ఆమె తలను తన గుండెలమీద ఉంచాడు పడిపోకుండా.

దయానిధి తెచ్చిన నీళ్ళను ఆమె ముఖంమీద జల్లాడు. ఆమె కదులుతూంటే నోటికి నీరందించాడు. ఆమె కళ్ళు తెరిచింది. ఒక్కసారి ఆమె కన్నుల్లోకి వెలుగొచ్చింది. ఠంగున లేచి అతని చెయ్యి పట్టుకుంది. "ఎన్నాళ్ళకి దొరికారు! మీరే నా భర్త". ఆనందం పట్టలేనట్లరచింది.

త్రుళ్ళిపడ్డాడు రామచంద్రమూర్తి. తెల్లబోయాడు. ఏమిటీమె ? పూర్తిగా యిరవయ్యేళ్ళు కూడా ఉండవు. తనకేమో ఆమె తండ్రి వయసుంటుంది. తనని – భర్త అంటుందేమిటి ? పిచ్చిది కాదుకదా ?

(జ రి గి న క థ)

'కనీసం ఈరోజయిన డాక్టరు దర్శనం జరుగుతుందంటావా ?' అని మిత్రులిద్దరూ అనుకుంటూ పిచ్చాసుపత్రి దగ్గరకెళ్ళారు. కానీ ఈసారి వాచ్‌మెన్ వీరి శీలాన్నే శంకించినట్లు నటించి 5 రూపాయలు తీసుకొని లోపలికొదిలాడు. 'మనకు కనపడిన పిచ్చాళ్ళంతా అమ్మాయిలు అందులోను సీరియల్స్ చదివే అమ్మాయిలు' అని అనుకున్నారిద్దరూ. మెట్లదగ్గరికి వచ్చిన ఇద్దరికి పైనుంచి ఒక నర్సు దిగివస్తోంది. వీరి దగ్గరగా వచ్చి రామచంద్రమూర్తిని చూస్తూనే గుడ్లప్పగించి నిలబడిపోయింది రాతి బొమ్మలా. (ఇక చదవండి)

ఆమె అతని చెయ్యి వదలకుండా గట్టిగా పట్టుకుంది.

అతను విడిపించుకోబోతే - పట్టు మరింత బిగిస్తోంది. ఎంత బలమనీ ఆ సన్నని చేతుల్లో !

"తప్పమ్మా....వదులు.... నేను నీ తండ్రిలాటివాడిని".

"నన్ను మీరు మాటలతో మోసం చేయలేరు...." నవ్విందామె. "మీరే నా భర్త! మీ కోసం ఎన్నాళ్ళనుంచి ఎంతగా అన్వేషిస్తున్నాననీ!"

అంటూనే....అతని చేయి వదలకుండానే....ఫ్లాష్‌బ్యాక్ లోకి వెళ్ళిపోయిందా అమ్మాయి. అతను వెర్రి మొహం వేసుకుని వినడం మినహా ఆమెను విడిపించుకోలేకపోయాడు.

ఇంటర్మీడియట్ చదవడాని కామె హాస్టల్లో ఉండవలసి వచ్చింది తండ్రికి ఉత్తరదేశం ట్రాన్స్ఫర్ కాగా.

ఆడపిల్లలకేనా .... మగపిల్లలకేనా కాలేజీ అంటే స్వేచ్ఛ, హాస్టలంటే యిష్టారాజ్యమూ. ఆ రోజుల్లో తెలుగు సినిమాకంటె కూడా తెలుగు సీరియల్ నవల ఎక్కువ ఫ్యాషన్ అమ్మాయిలకి. వాళ్ళు - నిద్రల్లోకూడా సీరియల్సే కలవరించే వారంటే కొంచెమే అతిశయోక్తి.

ఆంధ్రుల ఆరాధ్య రచయిత్రి....పాఠక హృదయరాణీ అనీ బిరుదులు (పత్రికలూ పబ్లిషర్లూ కీర్తించేవలా ఆమెను. తద్వారా పాఠకులను ఆకర్షించుకుందుకు). పొందిన ప్రముఖ పత్రికలో ఒక సీరియల్ రాసింది. ఆ సీరియల్‌లో హీరోయిన్ .... మొదటిసారిగా హీరోని చూస్తూనే మూర్ఛపోతుంది. అతనామెను పొదివి పట్టుకుంటాడు. ఇక - హీరో హీరోయిన్లు కలుసుకునే ఏ సన్నివేశమయినా సరే హీరోయిన్ మూర్ఛపోడమూ అదే తన డ్యూటీ అని హీరో పొదివి పట్టుకోడంతోనే ప్రారంభమౌతుంది. హాస్టల్ అమ్మాయిలు ఆ కాలంలో సినిమాల కంటే కూడా సీరియల్స్‌నే ఎక్కువ అనుకరించేవారేమో. . యీ మూర్ఛల హీరోయిన్‌ని అనుకరించడం మొదలు పెట్టారు. మూర్ఛతోనే - హీరోయిన్ .... మధ్యతరగతి అమ్మాయి అయిన హీరోయిన్ - కోటీశ్వరుడయిన హీరోచేత ప్రేమించబడడమూ....పెళ్ళి చేసుకోబడడమూ చదివి (కంఠతాచేసి) మేరేజ్ మేడీజీ అని భ్రమపడి



పోయారమాయకపమ్మాయిలు. నో కట్నం .... నో కాన్కలు....మూర్ఛలతో మూడులాభాలు. 1. ప్రేమించబడడం 2. పెళ్ళాడబడడం 3. బంగళాలలో నౌకర్ల సేవలూ పతిదేవుడి ప్రేమలూ అందుకుంటూ బంగారం జీవితం జీవించడం.

కోతికి కొబ్బరికాయ దొరికినట్లు దొరికింది అమ్మాయిలకీ మూర్ఛల సీరియల్. మూర్ఛ ఫేషనయింది - చాలా మందికి. మూర్ఛ-కొందరికి-అద్భుతమయిన భవిష్యత్తుకి ఆశాకిరణం అయింది.

రాయగా రాయగా కరణం (రైటరని మార్చాలీ సామెతను కాలానుగుణంగా). పడగా పడగా మూర్ఛ. వాసంతి అనే అమ్మాయి - సీరియల్‌ని-ఇన్స్పిరేషన్ కోసం ఎదురుగా పెట్టుకుని - గదిలో మూర్ఛలు ప్రాక్టీస్ చేయ సాగింది. అనతికాలంలోనే ఆమె ప్రావీణ్యం గడించింది. మగవాణ్ణి చూస్తే చాలు మూర్ఛపోయేంత ఎక్స్‌పర్ట్

**(expert)** ఐపోయింది. ఆఖరికి హాస్టల్ బాయ్‌నీ, కుక్‌నీ చూసికూడా మూర్ఛపోయేది అవలీలగా. ఆమె మూర్ఛ పోటం – నీళ్ళుజల్లి తెలివి తెప్పించడం న్యూసెన్సనిపించి – ఫాదర్‌కి ఉత్తరం రాసేశాడు వార్డెన్....మీ అమ్మాయి పూచీ నాదికాదని. తండ్రివొచ్చి సంగతి విని లబోదిబో మని....అమ్మాయినింటికి తీసుకుపోయాడు డాక్టరుకి

## పెంగ్విన్ క్షి (50వ పేజీ తరువాయి)

గుడ్ల కన్నా ఎక్కువ పెట్టవు. గుడ్లు పెట్టగానే వాటి బాధ్యతను మగ పక్షి తీసుకుంటుంది. అప్పటివరకు ఉపవాసమున్న ఆడ పక్షి ఆహారం సంపాదనకు వెళ్ళి పోతుంది. మగ పక్షి గుడ్లను తన పాదాలమీద కూర్చో పెట్టుకుని పొదుగుతుంది. గుడ్లు పొదగటానికి సుమారు రెండు నెలలు పడుతుంది. ఈ సమయంలో మగ పక్షి ఆహారం తీసుకోదు. సరిగ్గా గుడ్లు పొదిగే సమయానికి తల్లి పక్షి వస్తుంది. పిల్ల పెంగ్విన్స్ తమ ముక్కును తల్లి నోటిలోకి చొప్పించి ఆహారాన్ని అందుకుంటాయి.

ఒక ప్రాంతంలోని పిల్ల పెంగ్విన్ లన్నింటిని ఒక చోటికి చేరుస్తాయి. ఆ విధంగా ఒక ' క్రెచ్ ' ఏర్పడు తుంది. గుడ్లు పెట్టలేకపోయిన, సంతానాన్ని కోల్పోయిన పెంగ్విన్ పక్షులు ఈ ' క్రెచ్ ' ని రక్షించే బాధ్యతను తీసుకుంటాయి. ఆహారాన్ని మాత్రం తల్లి, తండ్రులు మాత్రమే ఇస్తుంటాయి.

పెంగ్విన్ పక్షులు పది నుంచి ఇరవై సంవత్సరాల వరకు జీవిస్తాయి. ఈ పక్షులకు మనుషులంటే అస్సలు భయంలేదు. దీనిని ఆసరాగా తీసుకుని పెంగ్విన్ పక్షులను పట్టుకుని చంపి దాని శరీరం నుంచి ఒక రకమైన కొవ్వును బయటకు తీస్తున్నారు. ఒకప్పుడు లక్షల సంఖ్యలో వున్న పెంగ్విన్స్ నేడు మంచు ఖండంలో వేల సంఖ్యకు తగ్గిపోయాయి. ప్రస్తుతం అంటార్కిటా ఖండానికి మానవ ప్రయాణాలు ఎక్కువయ్యాయి. పరిశోధనల నిమిత్తం అక్కడే వుంటున్నారు. కాని వీరివల్ల పెంగ్విన్ మనుగడకు ముప్పు వాటిల్లకుండా చూడాలి. **

చూపిస్తే – హిష్టీరియా అని భారంగానూ ; పెళ్ళి చేస్తే తగ్గుతుందని తేలిగ్గానూ చెప్పింది. తల్లిదండ్రులు చచ్చీ చెడీ సంబంధాలు తెచ్చారు.

పెళ్ళికొడుకుని చూస్తూనే యీమె మూర్ఛపోయేది.

ఆ పెళ్ళికొడుకులలో ఒక్కడూ మూర్ఛల సీరియల్ చదవనేలేదో, చదివినా ఆ సీరియల్‌లో హీరో అంత విశాల హృదయులు కారోకాని, ఒక్కడూ యీమె మూర్ఛలని ప్రేమించనూలేదు, పెళ్ళి చేసుకుంటామని అననూలేదు !

పైగా....

" ఈ మూర్ఛరోగి నాకొద్దు ". అని ముఖంమీదే చెప్పేసి మరీపోయారు. దానితో – ఆ పూర్ ఫాదర్ – బెంబేలెత్తిపోయాడు.

మూర్ఛ కుదిరితే కాని పెళ్ళికాదు, పెళ్ళయితేకాని మూర్ఛ కుదరదు. గుడ్డుముందా, పిల్లముందా – లాటి సమస్య.

కట్నం ఎక్కువ ఆఫర్ చేసినా ఎవరూ కక్కుర్తి పడలేదు. " ఇవాళ మీరు మరో పదివేలిచ్చినా – రేప్రొ పెళ్ళయ్యాక – ఆవిడగారెప్పుడు మూర్ఛపోతారో అని పట్టు కుందుకు హమేషా సిద్ధంగా ఎవరుండగలరు ? మూర్ఛ పోడం సులభమే. పట్టుకునే వాడికి తెలుస్తుంది మూర్ఛ రోగి బరువు ". అనేశారు నిష్కర్షగా,

మందులిప్పించినా తగ్గలేదు వాసంతి మూర్ఛ. పైగా – ఆమె మూర్ఛా ప్రావీణ్యం రోజురోజుకీ పెరగసాగింది. ఇంటికి బంధువులు కానీ, తెలిసినవారు కానీ – మగాళ్ళంటూ వొస్తే చాలు....వాళ్ళు వీధిలో ఉన్నా యీమె పెరట్లో మూర్ఛపోయేది. తల్లిదండ్రులు మాత్రం ఏం చేయ గలరు ? విసుగెత్తి – మూర్ఛపోతే పోనీ అని వొది లేశారు, చూసిచూసి. ఆమె మాత్రం తన నమ్మకాన్ని వదులుకోలేదు. తీరికుంటే చాలు, బైబిలులో అధ్యాయంలా ఆ సీరియల్‌లో మూర్ఛల ఘట్టాలను చదువుకునేది తన గదిలో ఒంటరిగా కూర్చుని. ఆ సీరియల్ నవలే ఆమెకు **అంత యిన్‌స్పిరేషనూ (Inspiration).**

ప్రేమ....పెళ్ళి....అన్నీ ఆ సీరియల్‌లో సూచించి నట్లు మూర్ఛ మూలంగానే జరుగుతాయని ఆమె సంపూర్ణ హృదయంతో విశ్వసించింది. మూర్ఛను విశ్వసించుము. నీకు సకలశుభములూ కలుగును – అని ఆ మూర్ఛ భక్తు రాలు త్రికరణశుద్ధిగా నమ్మింది.

అతిపవిత్రంగా దాచుకుంటూ .... అడపా తడపా ఒక్కొక్క అధ్యాయం చదువుకుంటూ .... ప్రాణంలో ప్రాణంగా చూసుకుంటున్న ఆమె పవిత్ర సీరియల్ -

సున్నాలు వేయించేటప్పుడు కాబోలు - యిల్లంతా సర్దుతూన్న ఆమె తల్లి కంటపడిపోయింది. పార్చ్‌మెంట్ పేపరులాటి అట్టకల ఆ పుస్తకం....అమ్మాయి ఎప్పుడూ వదలకుండా ఉండే ఆ పుస్తకం ఏమిటా అని చూసింది యధాలాపంగా. ముందు-బొమ్మలు చూసింది. సగానికిపైగా మూర్ఛపోతున్న అమ్మాయి బొమ్మలే, వివిధభంగిమలలో. అది చూసి-ఆవిడ ఆ సీరియల్ చదివింది. అంతే.... ఆవిడకు - అమ్మాయి జబ్బుకి కారణం తెలిసిపోయింది.

వెంటనే ఆమె చేసిన మొదటిపని - ఆ గ్రంధాన్ని అమ్మాయి కంట పడకుండా దాచెయ్యడం తరువాత ఆమె పిచ్చిడాక్టరు దగ్గరికి పరుగెత్తింది. పిచ్చి డాక్టరంటే - డాక్టరుకి పిచ్చి అనికాదు : పశువుల డాక్టరంటే డాక్టరు పశువని కానట్లే. పిచ్చికి మందిచ్చే డాక్టరు.

" మీ అమ్మాయిని కొన్నాళ్ళిక్కడ వొదిలెయ్యాలి ". అందా డాక్టరు.

" అలాగే. పిచ్చి కుదురుతుందంటే ఏమయినా చేస్తాం. అయినా - విడ్డూరం కాకపోతే పుస్తకాలు చదివీ సినిమాలు చూసే అలా తయారవ్వాలనుకోడమేమిటి ? సిరి అబ్బక పోయినా చీడ అంటుతుందంటారిదే. పెళ్ళి కావలసిన పిల్ల ...మీ చేతిలో పెడుతున్నాం. ఏం చేసినా మీదే భారం ". అంటూ కన్నీళ్ళతో - అత్తారింటికి పంపవలసిన అమ్మాయిని పిచ్చాసుపత్రికి పంపవలసి వొచ్చిందే అని తెగ విచారిస్తూ అమ్మాయిని అక్కడ వొదిలి వెళ్ళిందామె.

రామచంద్రమూర్తికి - జైలులో ఉన్నట్లుంది. ఈ అమ్మాయినుంచి ఎలా విడిపించుకోవాలో తెలియడంలేదు. ఇరుక్కుపోయాసని విచారిస్తున్నాడతను. ఆమె-వొదలదు.

ఆపద్బాంధవుడిలా వొస్తూ కనిపించాడు దయానిధి. అతను రామచంద్రమూర్తి దగ్గరకు వొచ్చి - ఆమెకు వినపడకుండానూ అతనికే వినిపించేలాగనూ ఒకవాక్యం గుసగుసలాడాడు చెవిలో. అది వింటూనే ఆతని ముఖం సిగ్గుతో నిండిపోయింది. ఛీ అనుకున్నాడు. కాని....తన పరిస్థితి జ్ఞాపకం వొచ్చింది. ఈమె పట్టునుంచి తప్పించుకుంటే తప్ప ఊపిరి సలిపేటట్లు లేదు. అందుకు....యీ నిర్బంధం నుంచి తప్పించుకుందుకు .... యీ చెరనుంచి బయటపడేందుకు ఎంతకయినా దిగజారవలసిందే అని

**ఫిబ్రవరి రంజనిమాల సమాధానములు**

అడ్డము

1. పరుల ధనంబు జూచి పరభామల జూచి, 5. రసములు, 6 తలచినుతింప, 8. గానరు 12. గప్పినవేళ మీ స్మరణగల్గునో, 15. భాగవతా పదాచారముల్, 17. కాంచన, 18. ముక్తినిధానము, 19. సిరులిడ, 20. దశకంఠ విలుంఠనచండుకాండ.

నిలువు :

1. పదయుగళంబుభూ, 2. ధరసమ, 3. చిర, 4. చిక్కని పాలపై మిసిమిజెందిన మీగడ, 7. పద ధ్యానము, 9. శరణాగత, 10. మానను, 11. కళత్ర, 13. రఘువీరనహి, 14. సద్గుణ, 16. తరువున.

మనసు సరిపెట్టుకుని....ఆమెవేపు కొంచెం వొంగి—చెవిలో ఎలాగో ఆ వాక్యం ఉచ్చరించాడు. అంతే. ఆమె అతన్ని వదిలింది.

బ్రతుకు జీవుడా అని పరుగులాటి నడకతో గేటువేపు నడిచి దయానిధిని కలుసుకున్నాడు. ఇక ఫరవాలేదను కున్నాక -

" ఆ వాక్యం ఎక్కడిది నీకు ? " అడిగాడు.

"ఆ పిచ్చి అమ్మాయి గురించితెలిసిన నర్స్‌చెప్పింది."

" ఆమె కెక్కడిది ? "

"ఆ మూర్ఛల సీరియల్‌లోదేనట. హీరోఅంటాడుట."

పాపము శమించుగాక - అనుకున్నాడు రామచంద్ర మూర్తి. అనవసరంగా దారుణమయిన అబద్ధమాడవలసి వచ్చింది ఆమెతో. పిచ్చిదాన్ని - తను మోసం చేశాడు, అబద్ధమాడి.

" రేపయినా మనం డాక్టరుని చేరగలమంటావా ? "

" ఏమో. అయినా ...యిలాగ....పిచ్చివాళ్ళని పైకి వొదిలేస్తారేం మన ప్రాణాలు తియ్యడానికి ? "

" సాయంత్రాలు - కొందరిని తిరగనిస్తారుట ".

" ఐతే - మనం కచ్చితంగా చెప్పలేం మీ బంధువు నెప్పుడు కలుసుకోగలిగేదీ ". (సశేషం)

# సమీక్ష

**(మా)నవలోకం** ( కవితా సంపుటి )

రచన : బి. రాములు. వెల : ఐదు రూపాయలు

ప్రతులకు : సారస్వతజ్యోతి మిత్రమండలి
సివిల్ హాస్పిటల్ రోడ్,
కరీంనగర్ - 505 001.
( లేదా )
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతి రోడ్,
సికింద్రాబాద్ - 500 003.

" స్నేహ దీపాలు వెలిగించేది ఈ లోకం / ఈర్ష్యాసూయలను తరిమేది ఈ లోకం / మమతల పందిరి ఈ లోకం/మనసున మల్లెలు పూయించేది ఈ లోకం"— అంటూ నూతన మానవ లోకాన్ని ఆశించే ఈ కవి కవితాభిమతం సర్వమానవ సౌభ్రాత్రం, మానవత్వం సమత్వంకోసం పరితపించేది___

ఇందులో " విప్లవాలు ముద్రించినపుడే / విశ్వశాంతి నిదురలేస్తుంది / సామ్యవాదం స్వాగతించినపుడే / ధన స్వామ్యం నడ్డివిరిగిపడుతుంది" అనే అభ్యుదయ "స్వాగత గీతిక"లతోపాటు " కాదేదీ కవిత కనర్హం " అన్నట్టు "అగ్గిపుల్ల"మీద, తారురోడ్డుమీద చివరికి " గడ్డిపరక" మీద కవి తన కవితాదృష్టి సారించి వాటి లోతులు కనుక్కోటానికి చేసిన ప్రయత్నాలున్నాయి.

సమ సమాజానికి " జాగృతి " కవితలో ఈ కవి చేసిన కొత్త సిద్ధాంతం ఇతరులలా ఘర్షణ సిద్ధాంతం కాకుండా ఆకర్షణ సిద్ధాంతం. ఉన్నవాడు, లేనివాడు విజాతి ధ్రువాలైనా సైన్సులోలా "లైఫ్" లో ఆకర్షించుకోరు. వికర్షించుకొంటారు. ఈ వికర్షణ ఆకర్షణగా మారితే (సఖ్యత సాధిస్తే) జాతి జాగృతమవుతుందని ఈ కవి ఆకాంక్ష - ఇది " స్వాగత గీతిక"లో కవి తాను చెప్పినదానికి విరుద్ధంగా వుంది.

స్వర్గ నరకాలకు ఈ కవి యిచ్చిన భావం " తేనెటీగల్లా పరిశ్రమించి / కున్నప్పుడు / కష్టానికి ఫలితం వచ్చి / కాయం తృప్తి చెందినప్పుడు / అదే అదే స్వర్గం. పాపంలో తేలుతూ / సోమరిపోతులా నిద్రపోతూ ఒళ్ళు గుల్ల చేసికొంటే / అదే అదే ప్రత్యక్ష నరకం అంటారు. ఈ కవిత ఆరంభంలో ఐదు లైన్లు వ్రాయకుండా పాఠకుల ఆలోచనకే వదిలేస్తే బిగింపుగా వుండేది.

గుల్లపేట సెలయేరు దర్శించి, స్పందించి, ఏటిలోని కమలాన్ని, కమలాప్తుడు సూర్యుణ్ణి నాయికా నాయకుల్లా, వాళ్ళ కాపురాన్ని కలతలులేని కుటుంబంగా - సమాజానికి తాజా సమతా సమాచారాన్ని అందజేసే సహజీవన కుటుంబంగా కవి భావించిన తీరు మధురంగా వుంది. ( ఈ కవితలో ఒకచోట కమలానికి " కలువభామ " అని వాడారు. కలువభామ చందమామకే చెందుతుందిగాని కమలాప్తుడికి చెందదు. )

శిలలా కాకుండా శిల్పంగా అందరినీ అలరించాలన్న తపన, — మనుషుల మనసులలో కనపడని మార్పును చూసి ఆవేదన-ఆ మార్పుకోసం "మనుషులు స్వార్థాన్ని జయించే / మనసున మల్లెలు పూయించే / మధుర హృదయులు కావాలి / సంకుచితత్వం పోవాలి / యువ తరం కదలాలి "-అనే ప్రబోధం పాఠకుల్ని ఆలోచింపజేస్తాయి.

వృత్తిరీత్యా తంతి తపాలా శాఖలో పనిచేస్తూ, ప్రవృత్తి రచనా వ్యాసంగం చేసుకొని ప్రయాణిస్తున్న శ్రీ బి. రాములుగారు ముందు ముందు మరింత శక్తిమంతమైన కవితల్ని వెలువరించి కవితాప్రియుల్ని అలరించగలరని ఆశిద్దాం !

రా శ

# పుస్తక సమీక్ష

## (మా)నవలోకం ( కవితా సంపుటి )

రచన : బి. రాములు. వెల : ఐదు రూపాయలు

ప్రతులకు : సారస్వతజ్యోతి మిత్రమండలి
సివిల్ హాస్పిటల్ రోడ్,
కరీంనగర్ - 505 001.
( లేదా )
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్,
రాష్ట్రపతి రోడ్,
సికింద్రాబాద్ - 500 003.

“ స్నేహ దీపాలు వెలిగించేది ఈ లోకం / ఈర్ష్యాసూయలను తరిమేది ఈ లోకం / మమతల పందిరి ఈ లోకం/మనసున మల్లెలు పూయించేది ఈ లోకం”— అంటూ నూతన మానవ లోకాన్ని ఆశించే ఈ కవి కవితాభిమతం సర్వమానవ సౌభ్రాత్రం, మానవత్వం సమత్వంకోసం పరితపించేది—

ఇందులో “ విప్లవాలు ముద్రించినపుడే / విశ్వశాంతి నిదురలేస్తుంది / సామ్యవాదం స్వాగతించినపుడే / ధన స్వామ్యం నడ్డివిరిగిపడుతుంది” అనే అభ్యుదయ “స్వాగత గీతిక”లతోపాటు “ కాదేదీ కవిత కనర్హం ” అన్నట్టు “అగ్గిపుల్ల”మీద, తారురోడ్డుమీద చివరికి “ గడ్డిపరక” మీద కవి తన కవితాదృష్టి సారించి వాటి లోతులు కనుక్కోటానికి చేసిన ప్రయత్నాలున్నాయి.

సమ సమాజానికి “ జాగృతి ” కవితలో ఈ కవి చేసిన కొత్త సిద్ధాంతం ఇతరులలా ఘర్షణ సిద్ధాంతం కాకుండా ఆకర్షణ సిద్ధాంతం. ఉన్నవాడు, లేనివాడు విజాతి ధ్రువాలైనా సైన్సులోలా “ లైక్ ” లో ఆకర్షించుకోరు. వికర్షించుకొంటారు. ఈ వికర్షణ ఆకర్షణగా మారితే (సఖ్యత సాధిస్తే) జాతి జాగృతమవుతుందని ఈ కవి ఆకాంక్ష – ఇది “ స్వాగత గీతిక”లో కవి తాను చెప్పినదానికి విరుద్ధంగా వుంది.

స్వర్గ నరకాలకు ఈ కవి యిచ్చిన నిర్వచనం బావుంది. “ తేనెటీగల్లా పరిశ్రమించి / తేనె జుర్రుకున్నప్పుడు / కష్టానికి తగిన ఫలితం పొందినప్పుడు / కాయం తృప్తి చెందినప్పుడు / అదే అదే స్వర్గం – సోమపానంలో తేలుతూ / సోమరిపోతులా నిద్రపోతూ / ఇల్లు ఒళ్ళు గుల్లచేసికొంటే / అదే అదే ప్రత్యక్ష నరకం” అంటాడు. ఈ కవిత ఆరంభంలో ఐను లైన్లు వాచ్యం చెయ్యకుండా పాఠకుల ఆలోచనకే వదిలేస్తే ఇంకా బిగింపు బాగా వుండేది.

గుల్లపేట సెలయేరు దర్శించి, స్పందించి, ఏటిలోని కమలాన్ని, కమలాప్తుడు సూర్యుణ్ణి నాయికా నాయకుల్లా, వాళ్ళ కాపురాన్ని కలతలులేని కుటుంబంగా – సమాజానికి తాజా సమతా సమాచారాన్ని అందజేసే సహజీవన కుటుంబంగా కవి భావించిన తీరు మధురంగా వుంది. ( ఈ కవితలో ఒకచోట కమలానికి “ కలువభామ ” అని వాడారు. కలువభామ చందమామకే చెందుతుందిగాని కమలాప్తుడికి చెందదు. )

శిలలా కాకుండా శిల్పంగా అందరినీ అలరించాలన్న తపన, — మనుషుల మనసులలో కనపడని మార్పును చూసి ఆవేదన–ఆ మార్పుకోసం “మనుషులు స్వార్థాన్ని జయించే / మనసున మల్లెలు పూయించే / మధుర హృదయులు కావాలి / సంకుచితత్వం పోవాలి / యువతరం కదలాలి ”–అనే ప్రబోధం పాఠకుల్ని ఆలోచింపజేస్తాయి.

వృత్తిరీత్యా తంతి తపాలా శాఖలో పనిచేస్తూ, ప్రవృత్తి రచనా వ్యాసంగం చేసుకొని ప్రయాణిస్తున్న శ్రీ బి. రాములుగారు ముందు ముందు మరింత శక్తిమంతమైన కవితల్ని వెలువరించి కవితాప్రియుల్ని అలరించగలరని ఆశిద్దాం !

జో రా శర్మ